హ్రీం నమః

# నిర్వేదము



గ్రంథకర్త :
దూబగుంట లక్ష్మీనారాయణశర్మ
తిరుపతి.

శ్రీం నమః

ఈ గ్రంథమును రచించుటకు కారణములు రెండు. నాకు పంద్రెండవ తరము వారైన దూబగుంట పెదబోడయ చినబోడయ యను సోదరులు, నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకాలోని దూబగుంట గ్రామము గూడూరు తాలూకా విందూరు గ్రామమునకు గ్రామ కర్ణములుగా వచ్చి, స్థిర నివాసులైరి. వీరు దూబగంట వాస్తవ్యులైన దూబగుంట నారాయణ కవిగారి వంశీయులు.

మా మాతామహుల వంశము ధూర్జటి మహాకవి గారిది. వీరి నివాస స్థానము శ్రీకాళహస్తి. ఆనాటి ప్రభువే మహాకవిగారిని విజయనగర ప్రభువగు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునకు పంపిరి. రాయల యనంతరము కవిగారు ఆనాటి రాజకీయ పరిస్థితుల వలన రామరాజుగారి సెలవు పుచ్చుకొని శ్రీకాళహస్తికి తిరిగివచ్చి ప్రభువువద్ద మండిరి.

తన కాలమంతయు, నృత్య గీత విలాసములతో గడచిపోయెనే యనునిర్వేదముతో శ్రీకాళహస్తి మహాత్మ్యమునువ్రాయ నుద్దేశించి ప్రభువుల అంగీకారముతో గ్రంథము వ్రాసి పూర్తి చేసిరి. గ్రంథమును శ్రీకాళహస్తీశ్వరునకు అంకితము నిచ్చు సందర్భమున కవిగారికి ప్రభువు కురపకనేరి యను అగ్రహారమును బహూకరించిరి.

ధూర్జటిగారికి ఇరువురు కుమారులు. జ్యేష్ఠుడు కుమార ధూర్జటి, తన తమ్ముడు పాండితిలో వెనుకబడి యున్నాడని, అగ్రహారమును సోదరునకు ఇచ్చి ఆనాటి నెల్లూరుప్రభువును ఆశ్రయించి, తన ప్రతిభచే కావలి తాలూకాలోని గోపసపాశెము అను అగ్రహారమును పొందెను. నేటికిని ధూర్జటి వారి కుటుంబములు ఈ గ్రామము నందున్నవి. ఈ యుభయ కుటుంబములు నెల్లూరు జిల్లాలోనే కాక ఇతర జిల్లాలలోను కలవు. ఈ కుటుంబములకు సంబంధ బాంధవ్యములు కలవు. మాము త్రాత

తండ్రి కుప్పరాజుగారికి కాళహస్తి ధూర్జటి వారి కన్యను సౌ॥ రామకమ్మ గారి నిచ్చి వివాహముచేసిరి. మాతల్లికూడ కాళహస్తి ధూర్జటివారి ఆడు బిడ్డయే. నా ద్వితీయ సోదరుని కుమారుల బిద్దరును ధూర్జటి వారి యింటి ఆడుబిడ్డలనే వివాహమాడిరి. ఈ సంబంధము అనాదిగా యున్నది. ఈ ఉభయ వంశములను మా వంశీయులు స్మరించుచుందురు గాక!

నా రచనకు రెండవ కారణము :- ప్రస్తుతము నా వయస్సు ఎనుబది నిండినది అనేక సంశయములతో ఈ పొత్తము వ్రాయ సంకల్పించి పూర్తి చేసితిని

సర్వాంతర్యామియైన పరాత్పరునకు రూపకల్పన చేసి, పేర్లిడి, ఆయనను శృంగార పురుషునిగ పెద్దలు వర్ణించుటకు కారణము తెలియదు. శ్రీవారికి "కాంతా కుచాంబురుహ కుట్మలలోల దృష్టే" "కమలాకుచ కుంకుమతో నియతారుణితాతుల నీలతనో", ఉజ్వల పర్యంక రమావినోది, "శ్రీకుచో పరిచేలాంచనమైన వీడడు", పాదాబ్జంబులపై కపోలతటిపై, పాలిండ్లపై, నూత్నమర్యాదం జెందు కరంబు మహిజాకుచ సంలగ్న కుఙ్కుమారుణవక్షనేనమోస్తు సీతాపతయే రామా అవన్నివారణే మొదలగు వర్ణనలు మహర్షులు చెప్పినవో, లేక కవులు వర్ణించినారో నేడు మనకు తెలియదు. క్షేత్రయ్యగారి పాటలు, అష్టపదులు అన్నియు శృంగార మయములే. ఇవి సంశయములను గలిగించుచున్నవి.

సీతారాములు వనవాసములో నిండు జవ్వనములో, నుండి కఠిన బ్రహ్మచర్యమును పూనినది వాస్తవము. కాని వారు తినుట, పూతేనెలు త్రాగుట, ముద్దు ముచ్చట్లు, ఆటపాటలు, లేక మూగనోము పట్టలేదు. చిత్రకూట సానువులలో, పూతోటలలో యథేచ్ఛగా విహరించుచుండిరి. నీరు లేనిచోట సీత యొక్క తిలకము చెరిగిపోవ చెమటతో మణిశిలను రాముడు చాది సీతకు తిలకముంచినదివాస్తవము శృంగారము మితముగ నుండిన సొంపు అధికమైన ఆభాసము. శ్రీ శంకర భగవత్ పాదులు జగన్మాతను తన సౌందర్య లహరిలో ఎంతగనో వర్ణించినారు. జగన్మాతకు కళంకము

లేదు, శంకరుల వారికి న్యూనతయు లేదు. ఆయన శివాంశ సంభూతుడు మహనీయుడు, కాళిదాసు గారు కుమార సంభవమున శివ పార్వతుల శృంగార విలాసమును చక్కగా వర్ణించినాడు. అంతతో కాళీ ఉపాసకుడైన కవిగారికి మత్సరాలేమి. కావ్యము న్యూనత చెందలేదు.

యోనీ సంభూతులుగా భూమిపై యవతరించిన పరమాత్మ తానెవరైనది యెందుకు వచ్చినది మాయపైగప్పి మరచి పోదురు. కడకు అయోనిజయైన సీతయే, ముల్లోకమాతయే మాయకు లోనయ్యెను.

రామావతారము నాటికి పరశురాముడు యవతార మూర్తిగా వెలసియుండెను. పరాత్పరుని శక్తిలో పరశురాముని శాతమెంత? రాముని శాతమెంత? రాముని పూర్ణావతారముగ చెప్పుకొందుము. అటులైన పరశురాముడు అవతారమూర్తి యెట్లగును.

బలరాముని దశావతారములలో చేర్చిరి కాని భారతమున శ్రీ కృష్ణుడు భగవానుడె వెలసినాడు. రామకృష్ణాదులు తమ యవతార కాలమున యెవ్వరికిని మోక్షమిచ్చినట్లు కానరాదు, తండ్రి దశరథుడు ఇంద్ర లోకమున చేరెను అప్పటను వారికి భరతుని పైనను, కైక పైనను మత్సరము తీరలేదు ఇక తల్లుల సంగతియేమో! స్నేహితులుగ సాహచర్యము చేసిన సుగ్రీవ విభీషణులకు అ పదవి రాలేదు బావమరదిగను, నమ్మిన బంటుగను గీతోపదేశము పొందిన అర్జునుడు కైవల్యము పొందినట్లులేదు. ఇక నేనెంత? కొఱగాని వాడను. నంద యశోదలు దేవకీవసుదేవులు వీరి సంగతేమి? అవతారమూర్తులుగా ఏ శక్తినుండి వెలువడిరో ఆ శక్తిని కలిసిన పిదప మోక్షమిచ్చు శక్తి తప్పక యుండును.

అరిషడ్వర్గములను, పంచేంద్రియములను, ఈషణత్రయములను అదుపులో నుంచుకొనలేక, చేయు అనుష్టానములు, ఈ జన్మలో కాక పోయినను, మరి కొన్ని జన్మలకైనను ఫలించునేమో ప్రతిమనుజుడును హరిని నమ్మి సుకృతకర్మ చేయుచుండిన, ఒక జన్మలో సంసార బంధ విముక్తుడుగ జన్మించి (శుకునివలె) బ్రహ్మపదము పొందుట తథ్యము. భగవద్గీతలోని ప్రతివాక్యమును అనుష్ఠించుటకు నాకు కొన్ని జన్మలు మిగిలి యున్నవి పాపములు చేయుచు పాప పరిహారముగ గీతా పారాయణము చేసిన పాప పరిహారమగునా? శ్రమ మిగులును. అష్టాదశ పురాణములు ఒకదానికొకటి సంబంధములు లేవు.

నేను ఉపకార వేతనము పొందు ఉపాధ్యాయుడను వయసు 84 సం॥లు దాటినవి, ఈ వయసులో నా మనోభావములను పద్య రూపమున వ్రాసితిని, భావములు యెంతవరకు సత్యములో నాకే తెలియవు భావావేశములో యతి భంగమగుట సహజము, నా పద్యములను తీర్చి దిద్దిన జోస్యుల విద్యాసాగరుగారు, ఎం. ఏ., (అర్. బి. ఐ) హైదరాబాదు. శ్రీ పోలూరు హనుమజ్జానకి శర్మ గారు, బి. ఏ., (ఆనర్స్) వి. ఆర్. కాలేజి, నెల్లూరు. ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసి ఉపకారవేతనము పొందుచు, నెల్లూరులో ఉన్నవారికి నామంగళాశాసనములు కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బయ్యగారు ఓరియంటల్ కాలేజి టి టి డి, అధ్యాపకులుగా పనిచేసి ఉపకారవేతనము పొందుచుండిన పండితులు, నా పద్యములుపూర్తిగా ముద్రింపతగినవని నన్ను ముద్రణకు ప్రోత్సహించెను. వీరు కన్నుమూసి కొద్దినెలలే యైనవి, ముద్రణ గ్రంథమును వీరికి సమర్పించుటకు నాకు అదృష్టములేదు. గ్రంథ ముద్రణమునకు ధనసహాయం చేసిన నా ఆప్త బంధువులకు గ్రంథముద్రణలో తోడ్పడిన శ్రీ సింగరాజు సచ్చిదానంద మూర్తి, శ్రీ వెంకటేశ్వర కళాశాలలో ఆంధ్ర అధ్యాపకులుగా పనిచేసి ఉపకారవేతనమును పొందువారికి, శ్రీ వెంకటేశ్వర కళాశాలలో అధ్యాపకులుగా పనిచేయు నెమ్మాని వేంకటరమణయ్య M. A. గారికిని వారి కుటుంబ సభ్యులకును నా మంగళాశాసనములు,

నాకు దూరపు జ్ఞాతియు దగ్గర బంధువైన నెల్లూరు వాస్తవ్యులు దూబగుంట నారాయణరావుగారు మంచికవి, వీరు రచయితలు, వెంకటేశ సుప్రభాతము; లక్ష్మీ నృసింహ స్తోత్రము (పద్యమాల) హంపీశిథిలాలు-గేయరచన, వెంకటేశ్వర కళ్యాణం (బీబినాంచారమ్మ నాటకము) ఫిర్దౌసి-నాటకము విభీషణ పట్టాభిషేకం శ్రీరామ విజయము(నాటకం) Reference Asia లో వీరినిగూర్చి వ్రాయబడినది.

నా ద్వితీయ సోదరుడు దూబగుంట వెంకటరమణయ్య (టీచర్) చాందసుల్తానా (2) తానీషా యను చరిత్రాత్మక గ్రంథములను వ్రాసిరి, ఈ కవిత పిచ్చిదూబగుంట వారిలో చాలమందికి కలదు.

భవదీయుడు,

దూబగుంట లక్ష్మీనారాయణశర్మ.



గ్రంథకర్త :

దూబగుంట లక్ష్మీనారాయణశర్మ

జననము : 10-3-1909

180, బైరాగిపట్టెడ - తిరుపతి.

శ్రీం నమః

# నిర్వేదము

విఘ్నకర్త వీవు విఘ్నహంతవు నీవు।
విఘ్ననాయకుడవు విమలమూర్తి,
నిన్నుదలచినంత నన్నిక విఘ్నముల్।
దరికి జేర వెఱచి యురికి పోవు॥

సిద్ధ సంకల్పుడగు దాస శేషగురుడు
తారకము నిచ్చె నా వాసుదాసు పేర
ఆగురువరేణ్యుల దలచియాదలందుఁ
దాల్చి పూర్ణకటాక్షము దాల్తు నిలను॥

అమ్మా నిను నేఁదలచితి
నమ్మయ్యేను పాతకములు భక్తిగమదిలోఁ
నమ్మా నిను నేగొలిచెద
నమ్మా నను గావు కరుణ శుభముల నిమ్మా॥

వచ్చి రాని మాట లచ్చుపడగఁ జేయు
కవిత నాది, వేరు కవితగాదు
ముచ్చటైన నాదు మురిపెంపు మాటల
వినగదమ్మ నిన్ను వినుతి సేతు॥

నాన్న లేని లోటు నెన్నడు రానీక
కంటి రెప్ప వోలె కాచి పెంచి
నట్టి, సుబ్బమాంబ యంచిత పాదాల
పూజ లిత్తు కోటి పూలచల్లి॥

మా తల్లి సుబ్బమ్మ మన్నించె నన్నెంతొ
చేయుదు ముత్యాల చేత పూజ
సంతానమే తన సర్వస్వమని యెంచి
ఎల్ల సౌఖ్యంబుల నొల్లకుండె
పరపీడనం బది పాపంబటంచును
పరమేశు పూజ నేపారఁజేసె
అట్టి నాతల్లి గన్న ఆతల్లి అట్టె
పెట్టు మాకెపుడు ఇ (మృ?)ష్టాన్నమట్టె మాకు

పట్టి చూడక మమ్మట్టె బాగుగాను
ఎట్టి కాపాడుచుండు నదెట్టు లనక

నాన్న మా వెంకట నారాయణప్పను
పూజింతు పాదాల పూలఁజల్లి
తాతల నాటిదై తనకుండు కరిణీక
పదవిని వదలెను ప్రాభవముగ
ధూర్జటి వారింట దోగాడుచుండిన
కన్య జేపట్టెను ఘనత యనుచు
తనకున్న దానిలో తగునట్లు విద్యను
బుద్ధులు జెప్పించె పుత్రులకును

అట్టి నా తండ్రి బంధు లోకాభి నుతుడు
చిన్నప్రాయాన నేనుండ కన్నుమూసె
తీర్చి దిద్దిరి అన్నలు తెంపుఁ జేసి
అట్టి నావారి దలతును అంతరమున ॥

పెద్దన రామకృష్ణులను
　పేరిమిగొల్చెద నెమ్మనంబులో
హద్దది మించునట్లు హృది
　నందెద ధూర్జటి సర్వకాలమున్
ముద్దది యౌను నాకు తగ
　ముచ్చట గూర్చును తిమ్మనార్యుఁ డే
ప్రొద్దు, సదా భజింతు తగ
　పోతన తిక్కన సత్కవీంద్రులన్

భారద్వాజస గోత్రుడున్
　పరగ నావస్తంబ సూత్రుండనై
సారాచార సుధీర చారు కవితా
　సమ్రాట్టుగాఁ నొప్పుచున్
శ్రీరాయప్రభు కూర్మి గూర్చెడు యశ
　శ్శ్రేయోభిలాషిన్ తపిన్
వీరారాధ్యుని ధూర్జటిన్ గొలుతునే
　విఖ్యాత విద్యానిధిన్

దానశీలుడు ధూర్జటి దైవసముడు
పాకనాటి నియోగియై పరగె నతడు
పాయ కీశ్వరోపాసనఁ బరగఁ జేసి
చేరె శంభుని చైతన్య రూపియగుచు

రాజుల మెప్పులు పొందగ
పూజలు తాబడసె నెన్నొ పూజ్యుల చేతన్
ఓజ యది మించునట్లుగ.
తేజముతో వ్రాసె కవిత తగ శంభునిపై.

దూబగుంట వంశ దుగ్ధాబ్ధి చంద్రుడై
పరగి తీవు పంచతంత్ర రచన
చేసినాడవయ్య చిత్రంబుగా బుధుల్
మెచ్చుకొనెడు నట్టు లచ్చుపడగ.

మిత్రా వరుణస గోత్రుడు
మైత్రిని జూపించె నెంతొ మానక యశుడై
పుత్రుల( బడసెను కీరితి,
శత్రులు లేకుండ( జేరె శంభు పదంబున్,

మరువరానివాడు మాతాత ముత్తాత
వంశ జాతుడగుచు వాంఛితముగ
తెనుగుతల్లి సేవ తెంపొప్ప( జేసెను
వారి ఆశిషములె నాకు వాంఛితములు.

ఉభయ వంశములకు నున్నది సంబంధ
మొకటి, నేటివరకు వొప్పు మీర
కీర్తనీయమైన కార్తీక పున్నమి
వెన్నెలట్లు, వెల్లివిరియు చుండు

కలికితురాయి( బెట్టి కనికానని కంచుక మట్టె బెట్టి లో
కలతల బెట్టు చూపుల కృపామతితో యటె శంభు(జేరుచున్.
వలపుల దేల్చు తల్లి,వలదన్న శుభంబుల నెన్నొ యిచ్చు ఏ
కలవరమేల నాకు కలకాలము నిచ్చు నభంబు మించగన్.

నమ్మితి నిన్ను నే మది
    ననారతమున్ నను గావరావె నా
నమ్మిక లెట్లు వమ్మగు
    సనాతన అల్లనఁ జేరదీయుమా
అమ్మరొ. సన్నుతింతును
    నుపాయముఁ జెప్పవె నిన్ను జేర, భా
గ్యమ్మది యెట్టులో
    కరము ప్రేమతో జూడవె నిన్ను వేడెదన్. 18

శంభు వామాంకమునఁ జేరి చాల సొక్కి
శుభముల నొసంగ యేతెంచి శోభమీర
నాదు గృహమునఁ జేరితో నాణ్యమొప్ప
ఏమి నాభాగ్య మమ్మ బంగారు బొమ్మ.

శ్రీరామా నిను నమ్మినాడను
    యశశ్రీయుక్తుడీ వొటచే,
నీరేజాక్షణ నన్ను బ్రోవు మిపుడున్
    నిన్నేమి యిమ్మంటి నా
గారాబంబునఁ గావమంటిని నినున్
    కన్నార కాపాడవే
నేరాలన్ మరి త్రోసిపుచ్చ తగనే
    నిన్నాత్మ ధ్యానించెదన్. 20

ధన ధాన్యంబుల వేడబోను
    మరియున్ దారా సుపుత్రాదులన్
నిను నే వేడను, వేడబోను
    తగునే నీవిట్లు నన్జూచుటల్
కననె నీచుడ గానె
    నిన్ను మదిలో కాంక్షించు వాఁడౌదునే
కనగా నేరము నీదుప్రేమ,
మహిమన్ కన్నార కాపాడవే 21

పదలాలిత్యము నర్థపాటవము
    పాటింప కెట్లో నినున్
పదపుష్పంబుల పూజఁ జేయుటిది
    నా ప్రాప్తంబుగాఁ నెంచితిన్
ముదమొప్పన్ తగ వాని నందుకొని,
    నా మూర్ఖత్వమున్ బాపవే
మదిలో నే నిను ధ్యానమున్ సలిపెదన్
    మారాడ నోరాడమిన్, 22

ముచ్చటైన రీతి మూడు పద్యాలను
చెప్పివాడనమ్మఁ జేరదీసి,
బుజ్జగించి నాకు బుద్ధులు సెప్పుమ్మ
నిలుపుకొందు నమ్మ నిన్ను మదిని. 23

నిలువుదోపులన్న నీకెంతయో ప్రీతి,
వెంకటేశ నిన్ను వేడికొంద్రు
నిలువబెట్టి దోచు నిర్భాగ్యు లెందరో
తలచువారు నిన్ను ఇలను గలరు. 24

వారికిని నీవు తండ్రివే వసుధలోన
వారి భక్తి విశ్వాసము బలయుతంబు
వారు భారంబు నీపైన పారవేసి
పోవుచున్నారు ముక్తికి పొంకముగను. 25

ఊర్ధ్వ పుండ్ర త్రిదండము లొప్పదాల్చి
వచ్చుచుండెద రార్జింప హెచ్చుగాను
పాడుచుందురు గళమెత్తి పాశురములు
వీరు పైవారి కన్నను విబుధు లెట్లు. 26

నీదు హుండీలొ చెయిబెట్ట నీవదేమొ
కోప తాపంబులను బూని కొంచమైన
పూని శిక్షింప వెప్పుడా పుణ్యజనుల
ఏమి నీదయా విభవమ్ము నెటుల చెప్పుదు. 27

నీదు ఆదాయమా గంగనీటిధార
వచ్చుటయు పోవుటయు చెప్ప వలనుగాదు
ఎక్కువగ నిచ్చువారలు పెక్కుటీలుదు
రెంత భాగ్యము నీకయ్య ఇందిరేశ. 28

నిన్ను స్తుతియించు టికచాలు నిలుపువాడ
దూషణంబును నగు వీకు భూషణములు
వ్రాయు నున్నవి మిక్కిలి రక్తిగలవి
వినుము మనసుంచి వివరింతు వింతగొలుపు. 29

విను నే వేడను వేడి నిన్ను
  మునుపెంతో నొచ్చె నా చిత్తమున్
నను నే నమ్మని వాని నైతి, మరి
  నానాధుండ వీవౌదువే,
విను విశ్వంభర వేడికొందు నిను
  సంప్రీతిన్ ననున్ జూడవే
కను విప్పంగను మేము కానమే
  కార్యంబెట్లు నా కిత్తరిన్. 30

సిగ్గుపడెదవేల చిన్నారి ఓరామ
సిగ్గునెల్ల నీవు సీతకిమ్ము
ఆమె సిగ్గుపడుట అతి వైభవము నిచ్చు
నీవు సిగ్గుపడుట నింద్యమగును. 31

నమ్మగజాలను నిన్నున్
నమ్మి చెడుట లేదిల నను న్యాయము తప్పెన్
నమ్మి చెడితి నే నిప్పుడు
నమ్మయ్యెను నీదు ప్రతిభ వసుమతిలోనన్. 32

సత్యసంధుడనిరి సాకేతవాసులు
భక్త వశ్య చంద్రు భాగవతులు
బిరుదుల నిచ్చిరో పెట్టుకొంటివో నీవు
ఎరుకగాదు నాకు ఇనకులేశ. 33

రానట్టిది రాబోవదు
రానున్నది రాకయుండ రామా సేయం
గా నౌనె చూడ నిలలో
నాకేలో కొలువ నిన్ను నాళీకాక్ష. 34

నీదు సుగణ చయము నేనెఱుంగని దౌనె
ఇచ్చినట్లు యిచ్చి పుచ్చుకొందు
విచ్చినావు భక్తి పుచ్చుకొన్నావది
నాకు మిగిలె నిరతి నలిన నయన. 35

వరము లిత్తువనుచు వాపోవుచుందురు
మూఢ జనము లెపుడు గాఢ భక్తి
వరము లిచ్చుశక్తి వరదాన మహిమంబు
లేవి తెలుపుమయ్య శ్రీవిలాస. 36

ఏమి పేర బిలుతు రామయ్య నిన్ను నే
నన్ని పేర్లు నీకు నమరియుండ
రామలింగయన్న రామచంద్రుడవన్న
నీవుగాక వేరె దేవుడెవరు, 37

నిన్ను నేను తలప నీకెంతొ విసుగౌను
నాదు పాపమంత నాదుకౌనగ
పుణ్యపాపములను పూని లెక్కించుట
నీకె తగు గదయ్య నిశ్చయముగ 38

బిచ్చమెత్తి నీకు పాత్రమచ్చొత్తించి
ఇవ్వదలచినాను ఇందిరేశ
బిచ్చగాని వద్ద పుచ్చుకో నెట్లన్న
మెచ్చ నీకు యిలను మాయదెపుడు. 39

నీదు పేర రచన నేఁజేయ నొల్లను
కూర్చు రచన లమ్ముకొనుటె యగును
నీవు చేయు రచన నిక్కం బదొక్కటే
వేరు రచన లేల వెఱ్ఱి మాకు. 40

క్షేత్రప్రాప్తి ననెడు నేగ లేకుంటకై
నిన్నుఁ జూడవత్తు నియతి తోడ
క్షేత్రవాసి వీవు క్షేత్ర మహిమగాని
నీదు మహిమ లేదు నిక్కముగను. 41

త్రాగువాడు నిన్ను తలపక త్రాగడు
జూదగాడు కూడ జోత లిడును
చోరుడైన నిన్ను స్తుతియించి ముందేగు
నిన్ను మరచిపోడు నీచుడైన. 42

కర్మచేయుట యేఫలాపేక్షలేక
మంచిదే యం్రదు బుధులు యోచించిచూడ
కర్మచేసిన ఫలమెట్లు కలుగకుండు
అట్టి కనరాని ఫలము నీవెట్టు లిత్తు. 43

చెప్పినవి మరల చెప్పక
చెప్పితి వెన్నెన్నొ మేటి చరితార్థంబుల్
చెప్పెడి వాడవు నీవై
యొప్పుగ వినువాడ వీవె యొప్పునె రామా. 44

నీకు పెండ్లి జరిగె నీచిన్నతనమున
నెన్మిదేండ్లు సీత నింపు గలుగ
లజ్జ నామెపై తలంబ్రాలు బోయుచు
చూచి తీవు చిలిపి చూపులొలుక. 45

ఏమిచూచినాడ వినకులోద్దీపక
అశుభము శుభము నెరుగనట్టి సీత
ఆటలాడునట్టి ఆడపిల్ల గనుక
కన్నులందు లేదు కపట మింత. 46

నీ చూపులు నాపోవుచు,
ఏ చూపులు లేని సీత యెదపై నిలిచెఁ
నా చూపులు బహుకోణము
లేచూపున నిన్నుజూతుఁ నిలకుల తిలకా. 47

పది రెండేడులు గడువగ
మది కింపగు రాజభోగ మమతల నొందన్
ముదితయు నీవును రామా
పదుడని మిము విధియె నెట్టె పాదపములకున్. 48

గారాబు పట్టి వైతివి
నేరాలే లేక పెంచె నిన్నా కైకే
ఘోరాపు కాలమగుచో౯
నేరికి నైనను తలంప నేర్పడు వింతల్. 49

సుంతైన ప్రేమలేకయె
వింతగ కైకేయి పంపె విపినంబులకున్
ఎంతటి కష్టంబైనను
వంతయనక పొందుదౌర వారిజ నాభా! 50

కైక కొంగుకు ముడివడ్డ క్ష్మావిభుండు
ఇట్టి వనవాసమున కాజ్ఞ ఎట్టులొసంగె
అడ్డుపడెనొకో రాచగృహాలు మీకు
పైనమైనావు తమ్ముతో, భార్యరాగ. 51

సుతవియోగదుఃఖ వితతి తీవ్రతనొంద
అతడు రేగి కైకం దిట్టసాగె
ఎంత తిట్టెనేని యిచ్చిన మాటను
తప్పలేకపోయె దశరథుండు. 52

తరుణి జానకి వెంటరా తమ్ముఁగూడి
భీకరారణ్య వాసంపు పాకుతోడ,
రాజ్యమును వీడి చనినావు రామచంద్ర
తండ్రిమాటను నిల్పితి ధరణియందు. 53

చిత్రకూటంబు మీరలు చేరినంత
అన్నివసతులు లక్ష్మణు డమర జేయ
చిక్కనట్టి ఫలంబుల మెక్కినారు
పూవు తేనెల ద్రావుచు పొంగినారు. 54

తేనియలు జుఱ్ఱుకొను జంట తేటులట్లు
రాముడును సీత మధువును ద్రావి రటవి
ఆట పాటల వారెంతొ యలసిపోయి
చేరినారయ్య పొదరింటి సీమయందు. 55

ఎందు కాయంతిపురవాస మేమి సుఖము
కట్టుబాటులు కలయట్టి కాపురంబు
భార్యతోగూడి హాయిగా నుండుటకును
వీలు గలుగదె యెంతటి విభవమున్న. 56

సంయమీంద్రుల తృప్తుల సల్పుటకును
చంప దలచెను చెవటి రాక్షసుల మూక
బ్రహ్మ సంకల్ప బలమటు లతిశయింప
చంపగలిగెను దైత్యుల క్షణములోన. 57

తాను చంపితి ననుకొంచు దరహసించు
సీత గమనించి చిందించె చిఱునవ్వు
శక్తి యెవరిదో తెలియగ జాల దతడు
ఆదిశక్తియె సీతయై యవతరించె, 58

శాంతికోసము నీవు విశ్రాంతి పొంద
సీత యొడిలోన పవళింప జేరినావు
ఆ మధురమైన సంస్పర్శ నలరినారు
మత్తు నిద్దుర వడి మంచియెత్తి వైచె. 59

పైటజారగ చందోయి బయట బడగ
దారి చనుచున్న కాకంబు తేరజూచి
పొడువ సాగెను నాయింతి పొలుపుచనుల
కారసాగెను రక్త మవ్వారి గాగ. 60

చూచె సీతమ్మ దానిని చుర చుర మని
మట్టి పెళ్ళను తీసి తా కొట్టెనంత
కోపమున రెచ్చి రక్కెను గోళ్ళతోడ
చూచె రాముడు దిగ్గన లేచి దాని 61

అట్టి దృశ్యముం జూచి యయ్యవనివిభుడు
భగ్గుమని మండి యస్త్రంబు బ్రాహ్మ్య మపుడు
ముందు వెనుకలు చూడక పూనివైచె
కాకి ప్రార్థింప విడిచెను కరుణతోడ. 62

ఎంతగా బాధఁ జెందితో యేమనందు
పొడవ సాగెను అకాకి పట్టుబట్టి
నీదుబాధను నీవట్టై నిగ్రహింతు
వారల బాధను చూచి నీ వోర్వలేవు. 63

అంతటి మునులే యటులే,
కాంతల గని పంచభూత గణముల పాలై
వింతగ పడిరన వాయస
మెంతటి దేనెంతవాడ నేదిక గతి హా. 64

కమ్మని పానీయంబులు
ముమ్మరముగ ద్రావివారు మురియుచు నెంతో
సొమ్మసిలిరి పొదరిండ్లనుతా
ఘుమ్మను వాసనల తోడ కమనీయంబై. 65

ఏమొ వ్రాసినాను యిది యెంత సత్యమో
నమ్మలేను నేను మిమ్ము గూర్చి
బ్రహ్మ పదమునందుఁ బఱగియుండెడి మీరు
మమ్ముబోటి వారి మమతలున్నె. 66

అన్ని నీవె యంచు నమరిన నీలోన
నీతులేమి మించు బూతులేమి
ఎన్నివేల బ్రహ్మ లిలను పుట్టించితో
తెలుపుమమ్మ మాకు తెల్లముగను. 67

నాదు సుకృతమొ నీ దయామోద విధమొ,
కూర్చినానమ్మ పద్యాల కుసుమమాల
అట్టి దాని ధరించి యీ రాముతోడ
నుండ నీకెంతొ శోభగా ఒప్పుకున్నె. 68

పూజసేతును పద్యాల పూలతోనె,
పూలు దొరకవు మదిలోన పూనినపుడు
నీవు నచ్చినపూవు లే తావులందు
దొరకునో యవి దొరకవో తోచదెపుడు. 69

పారబట్టె సీత పాపిష్ఠి వాడంచు
దూరు చంద్రు నన్ను దోషి ననుచు
దూర నన్ను మిగుల దూష్యమా నీ కథ
నాదు దోషమేమి నాదుతల్లి! 70

ఆటపాటల స్వైర విహారములను
ఆశ్రమోపాంత భూముల నలరుచుండ
యుక్తి రక్తుల నిర్భర శక్తితోడ
గడిచె పదమూడు వర్షముల్ క్షణములట్లు 71

నిందజేయుట కాదయ్య నీరజాక్ష,
నిండు జవ్వన సంపద నుండు మీరు
ఏండ్లు పదమూడు నెట్టితి రెట్టు మీరు
ఇట్టి సంతోష సంగతు లేమి లేక. 72

కావలోవాన మయ్యయో కష్టమంద్రు
అమరలోక సుఖమ్ము లవన్నిగూడ
పొందగల్గిరి దంపతుల్ పొందుగాను
లక్ష్మణుడు సేవఁసేయగ లక్ష్యముంచి. 73

అట్టి తమ్ముని పొందిన యందుకెంతొ,
తనదు మదిలోన గర్వించె దాశరథియు,
మరదియన్న సౌమిత్రియే మరదియంచు
సీత మదిలోన తాహాయిఁ జెందుచుండె 74

ఇఱువురకు సేవచేయుచుఁ నెలమినతడు
కంటికిని రెప్పవోలె తాకాచుచుండె
భయమదెటు గల్గు వారికి భద్రమయ్యె
వారి నేమంబె సౌమిత్రి వాంఛయగుట. 75

పంచవటియందు సౌమిత్రి భక్తి గొలువ
చేరి శూర్పనఖ మీచెంత చోద్యముగను
రాముఁజూచిన యారామ లాగ మొలుక
చేరి యతవికి తనకోర్కె చెప్పెనంత. 76

భార్యగలవాడ నాకిది భావ్యమగునె,
వెడలిపొమ్మని తానట్టె వెగటుజెందె
కోపమునరెచ్చి రాకాశి కోర్కెమీర,
మ్రింగదలచెను సీతను మిగుల రెచ్చి 77

అతడువారింప దానిని అధిమిపట్టి,
పిలిచె తమ్ముని తానెంతొ వేదనమున,
లక్ష్మణుడు కత్తిదూసెను లాఘవమున
కోసె ముక్కును చెవులను కుపితుడగుచు. 78

మిగులకుందె నామె మీపాడు చేష్టలఁ
నన్న కడకుజేరె చిన్నబోయి
తనదుస్థితి అన్నతో తరుణి చెప్ప
నంత దెచ్చె సీతఁ వింతనడు. 79

ఏరికైనను మండదే యిట్టి సేత,
భగ్గుమని మండె రావణు డగ్గిపోలె
రావణుడు సీత గొంపోయె రాజసమున
రాజనీతియెగాదె రాచరికమన్న. 80

గాధిసూనుని ఆనతిఁగాంచి, నాడు,
తాటకిని చంపలేదె విదారకముగ,
శూర్పనఖ కూడ రక్కసే చోద్యముగను
చంపకేలకొ ఆమెను పంపినావు. 81

చిత్రమిప్పుడు నీవట్లు నేయలేదు
ఏరికైనను ఎట్లుండు యిట్టిసేత
నింద లచ్చన్న పైనిడి నిలచినావు
జటిలమయ్యెను నదుగో సమస్య యిచట. 82

చెప్పు మిందులో రావణు తప్పదేమొ
తెలిసికొని గుట్టు ఆతని త్రెంచినావు
రాజధర్మంబు కాదొకో రక్క సీని
నేత నీవన్నయట్లుగా చెప్పుమయ్య. 83

తిరిగి నాయాకు సీతమ్మ కెదురదయ్యె
పరుగు లిడసాగె బంగారు వన్నెల మృగము
మాయలేడి యాశ్రమంబు చెంతతిరుగంగ
చిత్రముగ వది ఆకొనె సీత చూపు. 84

ఏమి జెప్పుదు సీతమ్మ కెట్టి యాశ
పట్టి తెమ్మని ప్రార్థించె భర్త నట్టె
మాయ మృగమన్న మానదె యామెపట్టు
అట్టె రాముడు వెడలెను పట్టుకొనగ. 85

సీత "లక్ష్మణా" యను కేక చెవుల బడగ
పోల్చి త్వరపడి లక్ష్మణు పొమ్మటంచు
తిట్టసాగెను తా వతి తీవ్రముగను.
తట్టుకొనలేక యాతడు తరలిచనియె. 86

చదివితి మీ సంభాషణ
మదినెంతో బాధపడితి, మనితి నదెట్లో
యెద నిన్ను తల్లి మాదిరి
మది దలచెడువాడు నీదు మరది గదమ్మా. 87

తల్లులకు తల్లి నీవై
ఇల్లాలై పరగుచుంటి విల రాముసకున్
ఇల్లెక్కి కూసినటు ఘలు
ఘల్లని తిట్టంగ నీదు తలపెట్టిదియో. 87

తిట్టుట కొక తీరున్నది
తిట్టితివతి దుష్టముగను తీవ్రత తోడన్
తిట్లను విని యాతడు తా
చట్టున తలవంచి పోడె వంతాపముతన్. 88

చెప్పిచూచినాడు తప్పని తానెంతొ
తప్పుకొనుట కెంతొ దారి వెదకె
వినక నీవె తగని విధముగా మొండిగా
పట్టుబట్టి రాముఁ బాసినావు. 89

పట్టుబట్టి మగని మట్టుబెట్టెను కైక
నీదు పట్టు చేర్పె నిన్ను లంక
ఏమి జెప్పువాడ నేమనగల, నీవు
అత్త మించుకోడలవైతి వవుర. 90

నాదు తిట్లయందు నా తప్పొకటి లేదు
నిన్ను నమ్మినాను నిక్కముగను
వరము లిత్తువీవు వరద బిరుద మొప్ప
తిట్ల, నీదు లీల తెలిపినాను. 91

నీదు చరిత జదివి నీ బాధలన్ తెలిసి
ఏడ్వవట్టి వార లెవరు గలరు :
నీదు కర్మ ఫలము నీవేడ్పుటయెగాక
ఏడ్వజేసినావ డెల్లవారి. 91

పరస భావముంచి సర్వాంగవర్ణన,
చేయు రావణాఖ్య చెయ్దిమునకు,
ఏలపూరకుంట? ఏలఖండింపవు
నాడు వర్ణశాల నీడ నుండి. 92

తన్నుదెలిసిన సీతమ్మ తానదేమొ,
విధి బలంబున తావట్టె వివశయయ్యె
రావణుడు వచ్చి తా పరివ్రాజకుడుగ
లంకకుం గొనిపోయెను లాగుకొనుచు. 93

అంతయు తెలిసిన నీవే
సుంతైనను తెలియనీక సూచింపకయే
వింతలు జేసితి వమ్మా
ఎంతని విను వన్నుతింతు నెప్పుడు మదిలో. 94

అన్నియు తెలిసియు నీవే
పన్నిన వలలోనబడుట భావ్యంబగునే
సన్నుతులు గలవె లంకను
ఎన్నంగా రాని బాధ లెటు లోర్చితివో. 95

నిన్ను తిట్టినాడ నీబాధ నెదనెంచి,
సన్నుతింప మనసు చాలదయ్యె
ఎన్నియున్నగాని యెప్పుడు కోపంబు
కనక నీవు కరుణగావు తల్లి. 96

తెచ్చి తీవు చేటు నచ్చట చెడె లంక,
వచ్చె పేరు రాము మెచ్చునట్లు
మెచ్చినారు మునులు మోదంబుతో మిమ్ము
సచ్చరిత్ర నిన్ను సన్నుతింతు. 97

తెలిసి తెలిసి నీవు వెతలు తెచ్చుకొంటి
తిట్టనేల మరది నట్టు లపుడు
రావణుండె నిన్ను రయమున గొనిపోవ
పతిని పిలువ నేడ్వ ఫలము గలదె. 98

లంక జేరినంత లక్ష్మణాచార్యుని శ్రద్ధ
భక్తి గుణములంత బయలు వెడలె
బోధపడిన యంత బాధతో కుమిలితి
వెన్నిమార్లు నీవు చిన్నబోయి. 99

లక్ష్మణుని నీవు తిట్టిన లక్ష తిట్లు
లంకలో గుర్తు నీకు బిరాన గలిగె
ఎంత తపియించి యింకెంత వంతబడితొ
అందుకేనమ్మ మారుతి నడిగినావు 100

నిను గానన యారాముడు
కన్నుల నశ్రువులు గురియఁగ కడుదపించెఁ
మనగలడె నీ వియోగము
మనసెంతో వికలమగుచు మూర్ఛపడిపోయెన్ 101

పగబూనవు వగజెందవు,
తెగనాడవ దెట్టి గట్టి తెంపరినైనన్
వగలేమిటి పగలేమిటి,
తగతల్లివిగావె కన్నతల్లుల కెల్లన్ 102

ఆ జగన్మాత పాతము లభినుతములు
పూనుచుండును వేషముల్ పూన్కి నామె
అమ్మ యమ్మ యటంచార్తి నందినంత
తొంగి చూచును నీ యింటి దోసముడుప. 103

నిన్ను తర్జించు రాక్షస నికరములకు
క్షమ నొసంగగ జాలితే సాత్వికముగ
ఎన్నొ భీభత్స శబ్దముల్ లట్టె వినుచు
కన్నుమూయని రాత్రులవెన్నొ నీకు. 104

చాలు చాలు యిట్టి సల్లాపములు తల్లి
విన్న చెవుల మొలిచె నెన్నొ మొలక
అన్ని తెలిసి యిట్టు లాడుట నీకౌనె
నిజము మరచినావు నీవు నిజము. 105

నీవు పొమ్మన్న రాముడు పోవుచుండు
నీవు రమ్మన్న వచ్చును నీదు వెనుక
పోవడే నీదు వాక్యమ్ము పూని వడిని
జింక వెన్నంటి నీయొక్క లెంకవోలె.

విభుడె కాదింక సాక్షాత్తు విష్ణువైన
దాటలేరమ్మ నీగోటి గీటు నెపుడు
సంప్రతింపులు నీతోటి సాగకున్న
సంశయంబులు తీరవే సొంతముగను.

నిన్ను తర్జించు రాక్షస నికరములను,
ఎగ్గు దలపక యట్టె మన్నింతువమ్మ
ప్రేమమూర్తివి గనుకనే పేర్మి నెపుడు
ఆ త్రిమూర్తులు నీయండ నందు చుంద్రు

తిట్టరాని తిట్లు తిట్టె నా భరతుండు
తల్లియనుచునైన తలపకుండ
అన్నపైని భక్తి యది యెంతయున్నను
తిట్ట తగునె యిట్లు తీవ్రముగను.

భర్త లేడ్చుట విన నీకు బాధగాదు
ఏల యేడ్చితి సీతపై జాలి గదుర
సీత నాది యన్నట్లు నే చెంతనుండ,
తెలిసె పిచ్చివాడవు నీవు నలుగ నేల.

దిక్కులేకుండ మీరిద్దరై తిరుగునపుడు
పావని కుదిర్చె మైత్రి సుగ్రీవుతోడ
మనసు చాలదె సుగ్రీవు మైత్రిగలుప
అగ్ని యెందులకవసరమయ్యె రామ. 111

మధువు లానడు మాంసంబు ముట్టుకొనడు
పండుకొను నేల కీటక బాధయున్న
నిదురపట్టదు విన్నెపుడు విలాపమదివి
అంచు మారుతి చెప్పె సీతమ్మతోడ. 112

నీవు ఋష్యమూకంబున నియతిఁజేర
పంపినావయ్య సుగ్రీవు వాలిపైకి
ఇట్టి రాజనీతివి పట్టినట్టి విభుడ
వేల కోపింతు నన్నుజూచి కాలపురుష. 113

తప్పు చేసెననుచు తారపిల్లితి నీవు
ఏమి తప్పు వాలి యొసగి చేసె
చెప్పుమయ్య రామ చిత్తముంచి యిపుడు
చెట్టు మాటు నుండి కొట్టి తౌర. 114

దెబ్బతిన్న వాలి తీవ్రతన్ ప్రశ్నింప
చెప్పవాడ నీవు తప్పిదమ్ము
రాజనీతి యంచు రాజసుతా జను
లెరుగ లేరు, ధర్మ వి ట్టిదనుచు. 115

వాలిఁ జంపగ నాతర జాతికదుర
ఘోరమని యేడ్వ తానంత పొరలి పొరలి
ధీరురాలైన మిక్కిలి ధీరుడైన
అనుభవింపంగ తప్పదా యజుని వ్రాత. 116

వాలి మరణించునని యెంచి వానిజేరి
అంగదుడె యువరాజని యనవె నీవు
వరము లిచ్చుట చూడ వనజనాభ
ఏడ్చు బిడ్డకు బెల్లమ్ము నిచ్చుటౌను. 117

అసలు జ్ఞానియైన యా రామమూర్తియు
ఏల యేడ్చెనయ్య బాలు రీతి
సీత పోయినపుడు చింతకులోనౌచు
బ్రహ్మలిఖిత మంచు బల్కుచుండి. 118

హనుమ రావణు నంతఃపురిని జరింప
చూడగనె సంభ్రమాశ్చర్య శోభ నందె
ఇతని బలమేమి, తేజమదేమి చెప్ప
దేవ విభునైన మించదే తేజమునను. 119

వంశనీయుడు గాడొ రావణుడు, సీత
నపహరింపకయున్న, నౌరౌర! ఒక్క
దుష్ట వృత్తిని తానెంతొ భ్రష్టుడయ్యె.
కడకు రాము కోపాగ్నికే పుడమిగూలె 120

పొందగలిగె పరాత్పరు పొందునసుర
పొందగలిగెనె దశరథు డెందునేని
విష్ణు పథమన్న సులభమౌ విధముగాదు
త్యాగి మాత్రమె పొందు నెందైనగాని. 121

ఆ విభీషణు సుగ్రీవు లట్టె నిన్ను
వారి సుఖములకై సేవ వాంఛ మీర
చేసినారయ్య మనసెంతొ చిక్కబట్టి.
ఏమి చేసిరి వార లపేక్షలేక. 122

తల్లి సీతమ్మపై భక్తి తవకదెంతొ
గాని మారుతి చేసెను పూని మిగుల
కోరికయె లేని యాతని గొప్పగుణము
చూచి యిచ్చెను సీతమ్మ శుభములన్ని. 123

ధర్మపత్నియంచు తగ నెరింగియు గూడ
పంపెపతియె నిన్ను అనలగతికి
ఏమి యిట్లు చేసె యేమి ధర్మంబకో
ఎఱుగలేము మేము సరిగ నేడు. 124

ఇట్టి వెన్నెయిన నీ లీల లట్టెయగును
నోటి నెవరైన తెరిచిన నొక్కుచుంద్రు
గతులు తప్పవె స్మృతుల్లకు మతులు పోవె
ఏమిటీలీల రామన్న యేమనందు. 125

అగ్నిసాక్షిగ పెండ్లాడి నట్టి దాని
పంపినావట్టె గర్భిణి వనములకును
ఇప్పుడెచ్చట డాగెనో యగ్నిచెపుమ
చాలు చాలింపు సిద్ధాంత సరళి నీవు. 126

వివ నింపగు మది సొంపగు
అనయము నీ చరిత రామచరితము నందున్
కనివిని యెఱుగని నేతలు
అనయము మాకట్టె తోచు నద్భుత రీతిన్. 127

పౌరజనముల పరిపరి ప్రస్తుతులతో
గురువు నానతి గైకొని కొంకులేక
చేరితివి సింహపీఠివి సీతతోడ
మరల ముమ్వరు మాతలు మోదమంద. 128

## -: కృష్ణ లీల :-

దేవకీదేవి గర్భాన దీప్తి నగుచు
పుట్టినావయ్య చెఱసాల బుధులు మెచ్చ
పురిటి యింటనె పుటుక భూరి మహిమ
తల్లికిన్ తండ్రికిన్ చెప్పి తరలినావు. 129

తల్లి చనుబాలు త్రావెడు తరుణమందె
చంప గలిగావు పూతన చన్నుపాలుగుడిచి
నడక ప్రాయంబు రాగానె నళిన నయన
త్రోయ గలిగావు మద్దుల త్రోవ సాగి. 130

ఏడుతై దులు నింద యదేమొగాని.
వెన్న ముచ్చువు నీవౌచు వెలసినావు
గొల్లభామలు నీవల్ల అల్లరికిని.
కొండెములఁ దల్లికడఁ జెప్పుకొనిరి కొన్ని. 131

నిండు పున్నమి వెన్నెల పండుచుండ
గొల్లభామల గుమిగూర్చి కొల్లలుగను
రాసక్రీడను వల్పవే లాగ మొప్ప
తీర్చి యా యమునా నదీ తీరమందు. 132

అన్న బలరాముడేమొ నీకన్న నయము
ఏవి వట్టించుకో దట్టె యెదుట నుండి
తల్లిదండ్రియు నీయాన దాటలేక
చూచు చుండిరి నీకొంటె చేష్టలట్టె. 133

కంసుచేసిన దుష్కృతిన్ కనలి నీవు
చంపినావయ్య నీవెంతొ చలము తోడ
తాత యెట్టులొ చెఱసాల తప్పు కొనియె
తల్లిదండ్రుల బాధలు తొలగి పోయె. 134

గోవర్ధన మెత్తితివట
గోవుల గోపకుల గాచుకొఱకది తగవౌ.
ఏవవి తగవో తెలుపవె
ఆ వస్త్రాపహరణమున నౌచితి గలదే. 135

ఎంగిలి లేదు నీకు నొగి నెంగిలి పండ్లను పొంగిపోవుచున్
మ్రింగితివయ్య నీవు వడిచెల్వము మీరగ చెంతజేరఁ గో
పాంగన లందరిన్ దరిసి అల్లరి జేయుచు ముద్దుగొంటి వో
దొంగ! నిజాని కెంగిలయి తోచె నివేదనలన్ని అక్కటా!

ఇంతవరకెంతయో ప్రీతి యెసగుచుండె,
వినగ సొంపగు వేడుక వెగటు గాదు
నిన్ను దలచుచు గొల్లలు నీదు కొఱకు
తరలి రమ్మంచు పల్లెకు తరలినారు. 137

కురు పాండవులకు సఖ్యము
కలుగని కారణము వలన కడు రోషమునన్
కురువృద్ధు లెంత చెప్పిన
కలుకు దనము వారియందు కానంబడియెన్. 138

సంధి వాక్యాలు కుదరని సమయమందు,
రెండు పక్షాలు పోరున రెచ్చిపోయె
చేరినావయ్య పాండవ శిబిర మందు
ధరణి భారంబు తగ్గింప దలచినావు. 139

వైరి సేనలఁ జూచిన వీరవరుడు,
వీరు నావారు బంధువుల్ ప్రియులటంచు
పోరు సల్పగ నొల్లని పూతమతికి
చేసినావయ్య బోధలు స్నేహమొప్ప. 140

పోరు నొల్లని వారికి పౌరుషంబు
బోధ సేయక ఆత్మల శోధ తగునె?
అందు సన్యాస యోగమదెందు కొఱకొ
తలలు గిఱ్ఱని తిరగవే తలచినంత. 141

జరిగె నాడది వాలి సోదరుల మధ్య
అవుర! నేటి కిటు కురు పాండవుల మధ్య
గిల్లి జగడాల బెట్టుచే చెల్లెనయ్య
కాదె యీ సుయోధనుండును ఘూఢు డకట. 142

పోరు సల్పె ధర్మని సుతుండు ద్రోణుతోడ.
విలువ లేదయ్యె శరముల నిలువరింప
చక్క భయమున నుండగ ప్రక్క నిలిచి
బొంక జేసితె ధర్మజు పొంకముగను. 143

అంతటి ధర్మజు చేతనె.
ఎంతటి అనృతంబు బల్కవేగతి జేసెన్
ఇంతటి భగవానుండే
వింతగ తత్వార్థమెల్ల విపులత తెలిపెన్. 144

కర్ణునకు జన్మకథనెల కరుణఁజెప్పి.
చేరమంటివి పాండవ తీరమందు
ద్రౌపదినిగూడ భాగంబు చూపతగవె?
ఎంత యత్నించితివి సంధి యేర్పడంగ. 145

కర్ణుడెంతటి దాతయో కద యటంచు
నీదు పక్షంబు చేరమి నేరమేమి?
అర్జునుని చేత చంపించి తౌరదేవ
నీదు నేతలు యెల్లను నీకెతెలియు. 146

కుంతి చేసిన యపకృతి కెంతొ వగచి
బాధపడె గాని బుద్ధిని మార్చుకొనక
తల్లి కిచ్చిన మాటపై తానె నిలిచి
చూచి చూడక పోయె నా సుగుణరాశి. 147

సూత సుతుని దాన సుగుణంబు నింద్రుడే
మెచ్చి శక్తి ప్రీతి నిచ్చెనంత
తనకు కలిగెడి కీడది తలచకుండ
తనదు కవచ మిచ్చె ధర్మనిరతి. 148

అతడె ధీరుడు ధన్యు డుదారు డయ్యె
కపటమే లేదె, నీవేద యాకపటి యేత
పోల్చుటకు నైన తగదె నీ పెంపదేమొ
నిలిచియున్నది తనపేరు నిశ్చలతతో. 149

ఆపదలొ నుండు కర్ణుని నట్టెచూచి,
ఆజి ధర్మంబు తలప వా యర్జునుండు
చంపు కర్ణుని రయమున జాగులేక
అనవె చంపె రాధేయు పార్థుండు సరభసమున. 150

వదలిన శాప ఫలంబునఁ
నెదురింతయు లేని కర్ణు డీల్గె రణమునన్
మదినెట్టు తలపగలమది
తుదకాతని దానకృతియె తుదముట్టించెౝ. 151

జనకు సుఖమునకై బ్రహ్మచర్యమూని,
నీదుపాదాలపై భక్తినిలునజేసి,
కడకు ప్రాణరహస్యమే కడగితెలిపె
త్యాగియౌ భీష్మ చంపింప తగునె నీకు ! 152

నేడు నిను గాతు భీష్ముని విగ్రహింతు
అనుచు క్రిందికి దూకవే అదను జూచి
అతడు చేసిన యపచార మనగ వేమి,
నిన్ను స్తుతియింపడే ! లేదె నీకు కరుణ, 153

ఏకపుత్రుని చావు సహింప లేక
అస్త్రి సన్యాసముంజేసె నాక్షణంబె
తక్షణమ వాని తలతెగి ధరణి గూలె.
అంత భగవాను భార మొకింత తగ్గె. 154

తండ్రి కబ్బిన మరణంబు తానెరింగి,
భగ్గుమని మండె కోపంపుటగ్ని (గ్గి) రేగి,
ద్రోణ పుత్రుడు వెంటనే దోషమనక
వంపె నారాయణాస్త్రింబు పెంపుమీర. 155

నీదు మాయకు లోబడి నిలుచు వఱకు
మోక్ష మది సున్న ఎవ్వరు పొందలేరు
నీదు మాయకు అతీతుడై నిలచునపుడు
చేరు బ్రహ్మపదంబును చివరికెట్లొ 156

కౌరవుల సర్వనాశంబు గాంచినంత
ద్రోణ పుత్రుండు దుఃఖాబ్ధి దోగిపోయె
దోసమను చింతయే లేక దూసె కత్తి
చంపె బాలుర నిదురించు సమయమందు. 157

గోకులము వదలినప్పుడు
నీకయి గోకులము కుందె నెగడిన వ్యధతో
గోకులము వదలి పడవే
వ్యాకులమున రాజకీయ వర్గపురీతిన్. 158

జాంబవతి తోడ సల్లాప సమయమందు,
వచ్చె సాంబుడు నిను జేర నొంటరిగను,
పుత్రుడంచును వానిని బోల్చుకొనక
శాప మిడితివి కుష్ఠు వై సాగుమనుచు. 159

నీకు ప్రియురాలు సత్య తా నిన్ను, వలపు
వాన జల్లుల ముంచె నీ మానసమును,
వామ పాదాన తొలగించు భామ చేత,
వలపు బహుమానమును గొన్న వరుడ వీవు. 160

ఎంతగ నేడ్చె నర్జునుఁడ దేమొ కుమారుడు ఆజి జావగా
కొంత యవంగరాదు మది కుందె వదెంతగ భీష్మ దేగగా.
వంతలు జెందె నెంతొ నుపపాండవులీల్గగ నిద్ర మబ్బులో
నుంత దలంప దయ్యెగద సూనృతమౌ నుపదేశమిందు కేన్. 161

స్వయముగ భగవానుండే
నయమొప్పగఁ జెప్పెనయ్య నరునకు ప్రీతిన్
క్షయ మొందగ స్వీయ జనము
వ్యయ మయ్యెను గీత బోధ ప్రబల పరీక్షన్. 162

ఏమి గీతోపదేశా లవేమొగాని.
అర్జునుం డేడ్చె నభిమన్యు డస్తైకూల.
జీవి పరతంత్రు డనియెడి భావమేది.
ఏమిటా గీత నొసటిపై గీతగాదె. 163

పాండవేయులు నీయాజ్ఞ పాలనమ్ము
చేసిరే? సాహచర్యంబు చిత్రముగను !
కానరాకట్టి మోక్షంబు కానరైరి.
ఏల యీాయవౌ వారల కింపుమీర.

తిట్టుచును శిశుపాలుడే పట్టె నిన్ను
తిట్టితిని నేను పట్టెద పట్టుబట్టి.
ఎట్టు తప్పించు కొందువో యెరుకగాదు.
పట్టి వదలకు మయ్య యో పంకజాక్ష. 165

సమయు పాపాలు చదివిన సప్తశతిని,
గీత జదివిన మోక్షంబు చేతికందు,
అంచు సమయానుగుణముగ అనుచునుంద్రు
శ్రద్ధలేకున్న కాదెద్ది సార్థకంబు. 166

నీవె కర్తయు భోక్తవై నిలిచినపుడు
భోక్త లుండురె? పిడికెడు భుక్తికొఱకు,
అన్నియును నీవెయై యుండ నప్పుడింక,
ఏమి యీ కర్మకాండ లవేమి తీట? 167

వ్రాసినారయ్య యెన్నొ పురాణ కథలు
చెప్పినారయ్య ధర్మముల్ చొప్పు చెడక,
చేసె గీతోపదేశమా శ్వేతవాహ
నకును, కృష్ణుడే పెడదారి పట్టలేదె. 168

నేను నీకు సమస్యగా నూను వఱకు
ఒల్లనిను నీ మోక్షంబు నొల్ల నేను,
నన్ను రక్షింపగా నీవె ఎన్ను వరకు,
అట్లుగాక నీవయి వత్తు వన్న సరియె. 169

నీదు పాత్రను పరికించు నిపుణమతులు
నేటి రాజకీయపు పాత్ర నిర్వహింత్రు
తగినవారైరి దేశంబు తగులబడియె.
ఏమి యేడ్చినగాని, యింకేమి ఫలము. 170

## -: శివలీల :-

కంపు గజ చర్మ మది నీవు కట్టనేల,
మేలి చీనాంబరంబు లవేల లేవు
తిరుగుటడవియేల మసనంపు తీరమందు
వనములే లేవె పార్వతి వెంటరాగ,
పునుక గిన్నెలొ భిక్షంబు తినగనేల,
షడ్రసంబుల భోజ్యముల్ చాల లేవె
ఏమి యీ కర్మ నీకెట్టు లొనరె, మాకు
తెల్పు మోదేవ గుట్టును తొలగ నేసి. 171

నెత్తిపై గంగ, గళంబు కుత్తుక నిక,
ఉంచుకొన్నావు యింపు గావించు కొనుచు
నీ కిదేమి పైశాచిక స్నేహమిట్లు,
రుద్ర! ఈగతి నుండుట రోత గాదె. 172

సర్వభూత దమనుడవు సర్వసాక్షి
వైన, నీకేల దక్షుపై ఆగ్రహమ్ము
ఎంత దక్షుడు? మన్నించి సుంత దయను
ఆదరింపడె విష్ణువు నమిత భక్తి 173

యజ్ఞదీక్ష యందుండెడు నట్టివాని
చంపరాదని ధర్మంబు చాటుచుండ,
దీక్షలో నుండు దక్షు వధింప జేసి
నావు, వర్తింప దేమి ఆ న్యాయమెట్లు. 174

మీర లెట్టుల అనసూయ జేరి అట్టె
లేకి కోర్కెను గోరితి రేమొగాని
అగ్రహింపక మిమ్మెంతొ ఆదరమున
పాపలుగ మార్చి ఉపదేశ భవ్యచరిత।

అసలు నారాయణుండె వేషాఢ్య మూర్తి.
అతని మోహిని రూప మీవట్టె చూచి.
ప్రక్క నుండెడి గౌరిని లెక్కగొనక
అట్టె పరుగిడవె మోహిని నంట బట్టి. 176

జగము పాలించు జగదాంబ చెంతనుండ
చపలబుద్ధు లవేలనో సర్వ వంద్య
అమ్మ అతిప్రేమతో చూచె సుమ్మ నిన్ను
అపుడు పార్వతి సహనంబు నంది తాను. 177

తల్లి దండ్రులు మీరలీ ధరణికెల్ల,
కారణములేక కార్యంబు కాదదెపుడు,
హనుమ పుట్టుక కారణం బింద్రుమీరు,
పుట్టె మారుతి నీకృప దిట్టయగుచు. 178

పాపడై నప్పుడే సూర్యు పట్టబోయె,
చదివె శాస్త్రార్థములు సూర్యు చక్కజేరి,
దాటె చంద్రమ్మ గోష్పాద సమముగాను,
చేరె నా లంక చూచె సీతమ్మ గోడు. 179

తల్లి యాజ్ఞను నౌదలదాల్చి హనుమ,
చేరె కిష్కింధ వాలి సుగ్రీవు గొల్వ,
వాలి దుష్కృతి కెంతయో వగచి వగచి
ఋష్యమూకాన సుగ్రీవు నెట్లో చేరె, 180

## -: వేంకటేశలీల :-

ఆది వరాహమూర్తివై యలరినావు
ఆ హిరణ్యాక్షు హతమార్చి ఆర్తి నీవు
తీర్చి నావయ్య భూదేవి చిత్త మలర
చేరితివి నీవు శేషాద్రి శిఖరమందు. 181

నీదు యాశ్రయ మంది యా వీరజాక్షు
దట్టై చేరెను నీచెంత గుట్టుగాను
చేరి యాతడు నీయందుచెలిమి జూపి
నిన్ను మించెను ప్రభువుగా ఎన్నొతెల్లు. 182

నీదు గుడిపైన సింహాలు, నీకు శుక్ర
వాసర స్నానా లదెట్లు వనితలకు వలె,
నీదు సన్నిధి తాయార్లు లేర దేమొ
పత్ని లేకుండ వెలసిన స్వామి కలడె! 183

అరసి వైభవ మిచట రామానుజుండు,
తన ప్రతిష్ఠను కొండపై దనరజేసి
తీర్చినాతమ్మ తిరుమణి చిత్రముగను
బాల వనుమాట యింకను పరిసిపోదు. 418

చేయుదు రదేల ఏకాంత సేవలిపుడు,
ద్వాపరంబున జరగవే వోపినన్ని
వాటి గుర్తుంచుకొని నీవు నేటి కిట్లు
జరుపుకొనుచుంటివా, స్వామి నిరతమిపుడు 185

## -: తాళిగట్టిన మంగమ్మ :-

తాళిగట్టిన మంగమ్మ తరలిపోయె
చేరె నా మంగపురి యట్టె చింతలేక
ఆమె చెంతకు పోవవె యనుదినంబు
ఏల ఏకాంత సేవ లవియేల నీకు, 186

పట్టు పరుపుల విగ్రహాల్ పండబెట్టి
బాదములు పాలు పండ్లను ప్రక్కనునిచి
ఏమి యేమియొ పాటల నెన్నొపాడి
ఆరగింతు రవన్నియు నలుపుతీర. 187

ఇట్టి ఏకాంతసేవల నేమియగును
ధ్యాన ధారణ నిష్ఠా విధానములను
చేయు సేవలు ఏకాంత సేవలగును
ఇట్టి సేవలు నీకవి ఎట్టు లౌను. 188

బీబినాంచారి మా యాడుబిడ్డటంచు
వచ్చుచుందురు తురకలు వందలాది
నిన్ను దర్శించి కానుక లవెన్నొ యిచ్చి
తలలు బోడులు చేసుక తరలుచుంద్రు. 189

నీకు కులమేమి మతమేమి నిజముచూడ
అన్నియును నీవెయై యమరి యుండ
కల్పనలు చేసినారయ్య కర్మమేమొ
ఏమి పేరున పిలుతునో ఇంక నిన్ను. 190

నీదు సేవలు వేలగు నూర్లు గావు
నల్ల డబ్బున్నవారికే చెల్లుగాని
మమ్మ బోటుల కందవే మాన్య నీవు
ఎచట నేర్చితి దేవేళ యిట్టి విద్య. 191

సర్వ జగముల పాలన సల్పు నీకు
అత్త మామ లటన్నది ఉత్తమాట,
మూర్ఖముగ వ్రాసినారయ్య పూర్వులెవరొ
మూఢ జనులకు మపముల ముదముగూర్ప. 192

నీదు మూర్తిని పీఠాన నెఱిబిగించి,
వెదురు బద్దలతో నొడల నదరగట్టి
పేలికల దిండ్లు హస్తంబు కాలమర్చి
చేయుచుందు రలంకృతుల్ చిత్రరీతి, 193

పాటలు నీకె యంచు పొరబాటని నెంచకు వెంకటేశ యా
పీట వశించు శ్రీ వరద వెంకట రాజుకు రంగనాథుకున్
దీటగు వైష్ణవంబుగల దివ్యుల కెల్లను నుత్సవాల నీ
పాటులు తప్ప వవ్వి వడి బారితి రేనియు అన్నిదిక్కులన్.

సుప్రభాతంబు కాగానె చోద్యముగను.
తిలలు బెల్లంపు చిమ్మిలి, తినగ నిత్త
రేల, తినబెట్టుదురొ దాని నెఱుగనైతి!
దాని తొలిరజస్వలయైన బాలకిడరె। 195

నిత్యమంగళంబు నియతితో నీకగు
పచ్చతోరణములు ప్రభవహించు
తలకు రెండువేలు తప్పక చెల్లింప
అగును రెండు లక్ష లనుదినంబు. 196

నీ ప్రసాదములే యవి నిజము చెపుమ
కొండదిగ పవిత్రత నవి కోలుపోవు
తీసి చూడ ప్రసాదముల్ పాసియుండు
నీ వాసంగు ప్రసాదమే నిత్యమగును 197

నీదు హుండీలో నిత్యము నిండు ధనము
నల్లదేగాని తెల్లదనంగా రాదు
ఆర్తి చేతనో మరి యే భయాకులత నేని,
వేయుచుందురు వేల రూపాయ లందు. 198

పాంచరాత్ర దీక్ష పాటించు వైష్ణవా
లయములన్ని నీదు విషయంబు వేరయ్యె
కుంభ మిడుచు నీకు (తిరుప్పావై) కూష్మాండ బలులిత్తు
రేమి, వైపరీత్య మిద్ది చెపుమ. 198

ప్రకట కూష్మాండ బలి నవరాత్రులందు
నిత్య కుంభమ్ము నిచ్చెడి నియతి యేల.
నీదు చేతులను శంఖ చక్రముల్ చెలగకుండ
శ్రీపతివొ నీవు శక్తివో చెప్పు నిజము 199

అకట! నీవేల పెద్ద బేహారి వైతి
నిన్ను మించిన వ్యాపారి నెన్న లేడు
వచ్చు వారల మది నొప్పి పడని యట్లు
హారణ మొనరింతు లక్షల ననుదినంబు. 200

నిన్ను జూడగ మనసు రాదెన్న నాకు
ఘంటలాదిగ 'క్యూ' లోన గడపలేను
ధనము నెగజల్లనౌనె నీ దయను గోరి
చూడ వేడుకబోయె నీజాడ లిపుడు. 201

వచ్చుచుందురు మా మంత్రి వరులు పరులు
వారి వసతుల ఖర్చుల పద్దుమూడ
వేల మొత్తాలెగాని యవేల తగ్గు
వారికిచ్చెడి పచ్చడాల్ వందలగును. 202

అన్ని అమ్ముకొనుట అచారమయ్యెను
కొన్నియైన నమ్ముకొనక విడవు
ఎన్ని అమ్ముకొందు వీలాగు నిత్యము
వెండ్రుకల నైన కొంచెమేన్ విడవవకట! 203

శ్రవణ తార వెలుగు జన్మదినమ్మున
వెంకటేశ నిన్ను వేడి కొందు,
సృష్టికర్త వీవు చెప్పు! చోద్యము సుమ్ము,
పెట్టి రెట్టు తార పుట్టిగాను. 204

నీదు సృష్టి యెంత నేర్పరి తన మహో,
పేరు తార కట్టి పెట్టు చంద్రు
వెట్టియంచు నైన వేతలంపెక్కదే
కోరి ఆడుచుంద్రు కోర్కెమీర. 205

కలియుగం బిది కాలంబు కలుషమయ్యె
ఆటలవి చెల్లె ద్వాపర మంతమయ్యె
ఆడుచున్నావు ఆడించినట్లు నీవు
చూచి చూడక పోయెడి చొప్పదేమొ. 206

పుణ్యపాపములను పూని లెక్కింపంగ
ఇలను మేటి శెట్టి వీవెకావె
పుణ్య పాపములకు పొందుగా ఫలమును
ఇయ్యకుందు వొక్కా! ఎవరికేని! 207

## -: దేవీ స్తోత్రము :-

' యా దేవి సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థిత '

నిదురలో ముంచి మమ్మట్టె నిదురబుచ్చి
ప్రాణధనముల కాపాడి భద్రపరచి,
నిదుర మము లేపుచుందువు నిత్య మిచట
ఏమి నీప్రేమ మాపైన యేమనందు 208

ఆ జగన్మాత పాఠము లభిషుతములు,
పూనుచుండును వేషముల్ పూనికనామె
అమ్మ రమ్మా, యటంచార్తివందినంత
తొంగిచూచును నీయింటి దోసముడుప. 209

నిన్ను ధర్షించు రాక్షస నికరములకు
క్షమ నొసంగగ జాలితే సాత్వికముగ
ఎన్నొ భీభత్స శబ్దమ్ము లట్టె వినుచు,
కన్నుమూయని రాత్రు లవెన్నొ నీకు. 210

చాలు చాలు యిట్టి సల్లాపములు తల్లి
విన్నచెవుల మొలిచె నెన్నొ మొలక
లన్ని తెలిసి యిట్టులాడుట నీకౌనె,
నిజము మరచినావు నీవు నిజము. 211

నీవు పొమ్మన్న రాముడు పోవుచుండు
నీవు రమ్మన్న వచ్చును నీవెనుకనె,
పోవడే నీదు వాక్యమ్ము పూని వడిని,
జింక వెన్నంటి నీయొక్క లెంకవోలె. 212

విభుడె కాదింక సాక్షాత్తు విష్ణువైన,
వాట లేరమ్మ నీగోటి గిటునెప్పుడు
సంప్రతింపులు నీతోటి సాగకున్న
సంశయంబులు తీరునే సొంతముగను. 213

తలచినను తలచకున్నను,
కలయందున నైననేని కావనివారిన్
తలవంచకుండువారిని
కలకాలము వారిజూచి కావుము తల్లీ. 214

'పుండ్రేక్షు కోదండ పుష్పబాషణ హస్తే నమస్తే!'

కామలీలా వినోదిని కంబు కంఠి,
ఎవరి మనముల నేడ్పింప నెంచి తీవు!
ఇక్షు కోదండ పుష్పమ్ము తిల్లు దాల్చి
సవ్య దక్షిణ హస్తాల సరసముగను. 215

'సచామర రమావాణి సవ్యదక్షిణ సేవితా'

(లలితా సహస్రము)

కుడి ఎడమల నిను జేరుచు,
తడయక వాణియును రమయు తగచామరముల్
వడి వడిగ వీచుచుందురు
పడికాపులు కాయుచుండ్రు పరగ త్రిమూర్తుల్. 216

"నమంత్రం నోయంత్రం తదపిచ నజానే స్తుతిమహో"

(అపరాధ స్తోత్రము)

మంత్ర తంత్రములను మరి జపహోమాలు
చేతగావు తల్లి చేయుటకును
ముద్రలైన రావు మురిపెంపుమాటల,
నిన్ను స్తుతులుచేసి నిలుపుకొందు. 217

'మాణిక్యమణి మంజీర రంజిత శ్రీపదాంబుజ' (లలితా సహస్రము)

కుందన మణి మంజీరము
లందముగా పాద యుగ్మమందు ధరింపన్
పొందగు నీ నీడ కలగని,
మందస్మిత మొందె శివుడు మమతయెలర్పన్ 218

సుందర మణి మంజీరపు,
టందముతో నొప్పునట్టి అంఘ్రి ద్వయమున్,
చందనపు నీళ్ళ గడుగుచు,
మందారము లుంచువాడ మమతలు దొలగన్. 219

"నాభ్యాల వాల రోమాళి లతాఫల కుచద్వయి,
కామేశ బద్ధ మాంగల్య సూత్ర శోభితకంధరా''
(లలితా సహస్రం)

నాభి మూలంబుగా ప్రాకు నవ్యలతకు
ఫలము లయ్యెను కుచములు పార్వతికిని
శూలి గట్టిన మాంగల్య శోభయేమొ
దిక్కు లలమెను కాంతులు పిక్కటిలగ. 220

మంచు శిఖరాల మీరెట్టు మనుదురమ్మ
వింత యగునమ్మ యదివిన యెంతగానొ.
ఉండనొల్లము, మీరెట్టు లుందురమ్మ
లేవె లోకాలు మీరుండ లీల తోడు. 221

మానస సరోవరంబున మమత తోడ
క్రీడ యొనరింతురని విందు జోడుగాను
మన్మనస్సరస్సున మీరు మనిన యెడల
మోదమది యిచ్చు, యిక నాకు ముక్తి నిచ్చు.

మీరు క్రీడింతురా సహస్రాంశమందు
మాకు మాటాడ నోరాడ దేరికేని
నిక్కమిదిగాని లేరొండు లెక్కగాదు
వివగ చోద్యము యిదియౌను వేరుగాదు. 223

నీదు ఆశీస్సులను పొంది నిలుచు హరియె,
చెప్పె లలితా సహస్రంబు చొప్పుచెడక
లోక కల్యాణ మనునట్టి సాకు తోడ
చేయుచుందువు లీలలు చిత్రముగను. 224

ఇందుకే యా త్రిమూర్తులు యింపుమీర
నీకు హారతి బట్టుదుర్ నిరతితోడ
ఎలమి నీయాజ్ఞ శిరసావహింప నెంచి,
చేయుచుందురు పనులన్ని చిత్తముంచి. 225

నిన్ను తర్జించు రాక్షస నికరములను
ఎగ్గుదలపక యట్టె మన్నింతువమ్మ
ప్రేమమూర్తివి గనుకనే పేర్మినిన్ను
ఆ త్రిమూర్తులు నీయండ నందుచుంద్రు. 226

మారాడగ నోరాడదు,
పారావారంబు వోలె ప్రస్తుతిఁ జేయున్
నీరాజన మిడు దేవికి,
నీరేజాక్షుండు నియతి నియమము తోడన్. 227

నీదు పేరుపై సర్వంబు నీరజాక్ష.
తల్లి ఇందిర గావించు తగిన రీతి,
అన్ని వడ్డింప పళ్ళెంబు గన్న నీవు,
ఆరగింతువు కడుపార హాయి మీర. 228

కష్టమామెది మరి పేరుగనగ నీది
వరము లామె యిచ్చుచునుండ వరదబిరుద
మీవు పొందినాడవు గొప్పదేవుడ వని
చేరనేల నీయాలయ సీమలందు.

' యాదేవీ సర్వభూతేషు భ్రాంతి రూపేణ సంస్థితా
(సప్తశతి)

భ్రాంతి రూపంబుతో దేవి బఱగుచుండు
భ్రాంతి జెందుచునుంద్రు విపశ్చితులును
సత్యమెఱుగక చెడుగును సన్నుతింత్రు
వింత యది యేమొ అమృతమా విషమదైన.

నిన్ను స్తుతియింప నేనెంతవాడనమ్మ
సన్నుతింపను శంభుడే చాలడెంతొ
సన్నుతులు సేయరే నిన్ను సరసరీతి !
ఎన్న రమ వాణి లట్టె నిన్నెంతగానొ.

కోపమనునది శంభుకే లేకపోదు,
కోపమేలేదు నీకు నాప్రాపుకావె
నీవుకోపింప నెవ్వరు నిలువలేరు
కరుణ కాపాడు నీకట్టె ఖ్యాతి గలుగు. 232

నీకు శరణన్న పిమ్మట నాకదేమొ
ఒరుల వేడంగ మనసెట్టు లొప్పునమ్మ
నమ్మినట్టి నాకు నయమది చూపక
భయమునందు ముంచ భావ్యమగునె. 233

ఆమె నీడ నా త్రిమూర్తు లలరుచుంద్రు.
ఆమె యానతి మీరగా భువి నెవరికైన
అరయ హరికైన శివుకైన నలువకైన
వాణి సహితము చేయు నపర్యలెన్నొ. 234

తల్లులకు తల్లి నీవెయ్యె తనరినావు
నీదు తండ్రిపై కోపంబు నీకదేల.
దక్ష యజ్ఞాన నీ మేను దగ్ధమైన
కతన, యెందరికో ముప్పు గలిగెగాదె! 235

అన్నికళలకు మూలమీ యాదిశక్తి
అన్నిశక్తుల కీమెయే యాశ్రయమ్మ.
ఆమె సృష్టిలో సౌందర్య మతిశయింప
ఆమె సౌందర్య మెంతని యనగవచ్చు. 236

(కరాంగుష్ఠ నఖోత్పన్న నారాయణ దశాకృతి)

ఆ మహాశక్తి సంకల్పమైన యంత
పుట్టుచుండును ధర విష్ణుమూర్తి తరచు
తగినపనులవి తీర్చుచు తరలుచుండు.
తత్వమిది యౌను కాదింక తత్వమేది యు. 237

అమ్మ నీ వారమై మేము యలరినాము.
మమ్ము కాపాడు బాధ్యత మీదె యౌను.
దేని కర్హతయో, తగ దానినిచ్చి.
నాదు పై రును పచ్చగ నుంచుమమ్మ. 238

## -: నిర్వేదము :-

తప్పులు చేసినాను, బహుధా తలవంచితి బంధుకోటిలో
మెప్పులు పొందనేర, మరి మెచ్చి బుధుల్ నను 'సై' యనంగ న
న్నెప్పుడు కావుమంటి నిను, ఈ విధిగా నను త్రోసి పుచ్చ, నీ
చొప్పు వినంగ గల్గితిని, చొప్పది తప్పెను చోద్యమయ్యెడిన్.

పెట్టిపోయిరి తెనుగున పెన్నిధులను
ఆ మహాకవుల్ మన సేమమర్థిగోరి,
వారి గ్రంథములే మరుగునబడియె నేని
తెలుగు తెగులౌను, తెలివిగా తెలిసికొనుడు. 240

పూని ఆంగ్లేయుడైనట్టి బ్రౌను దొరయె
ఎంతయో సేవ తెనుగున కెలమిజేసె
అందులో శతాంశము మనపొందజేయ
కున్న, ఆపెన్నిధుల్ మొత్తమెన్న సున్న. 241

పరగ బహు కావ్య పరిచయ భాగ్యమున్న
వేదికల నెక్కి మాట్లాడు వేత్తలైన,
మెప్పు యిహలోకమున పొంది మరిమేటులైన
అంతమాత్రాన మోక్షంబు నందగలరె. 242

కోరకయె యన్ని యిచ్చుచు,
ఊరక చింతాబ్ధి ముంచు టెట్లు చింతంబౌ,
కోరితినే నాకిమ్మని,
పోరుట సన్నిధ్వ నిట్టి పోకడ తగునే. 242

తెన్న బెట్టి నిమ్ము పంత్రప్పి కూర్తునే.
పూజసేయలేను పొన్నపూల
సన్నుతింప నిన్ను చాతుర్య మాసున్న
నన్ని కెట్టు కాతు వెన్నిచూత. 243

పలువుర పరిహాసంబులు
అలుగుల వలె నాటెనయ్య అతినిష్ఠురతన్
పలు త్రోవలు పరికించిన
తొలగించు నుపాయమేది తోచదు నాకున్. 244

పుత్రుల సంగతిన్ వదలి, పుణ్యమటంచును నిన్ను జేరగా
శత్రువు రీతి శోధనము, సల్పుటయెందును మేలటయ్య నే
మిత్రుడ గానె నీకు కడుమేటివి ఆశ్రయమీక నీవు, నా
పత్రములన్ ఫలోదకము పాయక నీవె గ్రహింపు పుణ్యమౌ.

ఆగమ శాస్త్రిము జదివిన,
బాగుగ సంగీత విద్య పాటవమున్నన్
యోగాభ్యాసము చేసిన
సాగుచునేయుండు కర్మ సంచితమెపుడున్. 246

పెద్దలు చెప్పినవన్నియు
సుద్దులె యగుచుండు వారిసునిశిత భావా
బొద్దిక గ్రహింపగావలె
నద్దుగ మీరుండు డనుచు చాటిరి వారల్. 247

పెద్దలను ధిక్కరించుచు
హద్దును పద్దింత లేక యారాటముతో
ఎద్దువలె తిరుగునాతడు,
మొద్దానో సర్పమగునో మొసలే యౌనో. 248

విన్న శిశుపాలు డెప్పుడు
సన్నుతి జేసెనొ యెఱుంగ సరగున చేరెన్,
నిన్ను మరి నాతు నర్చన
లన్నియు నేలయ్య, వైరమందుట మేలా. 249

భక్తి వ్యాపారమయ్యెను రక్తి పెరిగె,
భుక్తికే యిట్టి యుక్తులు పుడమి వెలసె
భక్తి ముక్తులు రెండు నభావ్యమయ్యె
మిగిలియున్నది స్వార్థమే మేటియగుచు, 250

దేహధారికెపుడు దేహంబుపైనాశ
అహము పెరిగి వాని నంటి యుండు
ఇహమటన్న యతని కెంతయో మక్కువ
దుర్జనులకు నిద్ది ఘోరమగును. 251

సారెకు నిన్ను వేడ, సరసంబది పోవును, మాటి మాటి కే
పారగ నిన్ను వేడను నుపాయముగా తగు వేళలందు సా
కారము గానొ లేక మరి జ్ఞాని విధంబున బూనుచున్ నిరా
కారము గానొ యెంచెదను, గాఢపు భక్తిని నెమ్మనంబునన్.

మరి యదేలకొ యా జగన్మాత కెపుడొ
వాహనంబవై యుంటివా పైననేమొ
వాహనమెగాదు బాసిన పై శివకట,
చదువ నీ కథలెల్ల సంశమె యొదవు. 253

మహిషున కిచ్చిన వరమున
మహితమ్మగుబాధ తప్పె మాధవునకు
మ్మహినెందు వెదక అజ్ఞలు,
మహిమలు, నగపుత్రికవేసుమా ఎటుగన్నన్ ? 254

ధ్యానక సత్యసంధుదను మాటను ఔదల దాల్చినాద నో
మానిత దైవమా సుమహిమాన్విత, ఓజగదేకవత్సలా,
పూనిననిన్ వడిన్, కొలువవో మది నెంతటి వాదనేను ఓ
దీన జనావనా, కరుణ దీనుని బ్రోవుము నిన్ను వేడెదన్.

పోరును నల్పగా మనసు పోదు మహాత్మ ద్విజుండవౌటచే,
సారెకు వేడబోను. సరసంబులు లేవవి నీకదేలకో,
పీడుడ వైదువేయయిన, పీడుడుగా నను వేగ గావు నీ
వీరత సార్థకంబగును పృధ్విని దేవుడ వీవె కావకో, 256

పుట్టినదాదిగ నాకే.
పట్టెను వెతలెన్నొ లేని బాధలవెన్నో.
పట్టిన నీకష్టంబులు,
నెట్టుల భరియింతునయ్య ఇనవంశమణీ. 257

కరివరదుడవీవౌటనె,
మరి మరి నేవేడినాను మనసటిలేవో
సిరి యిమ్మని నే వేడను,
వరమిమ్మని యంతకంటె వదర వదెపుడున్. 258

అత్తరులు నొప్ప చేలంబులైన లేవు
మత్తు లాహిరిలో ముంచు మాట లేదు.
ఎత్తి పొడుపుల సత్య నేనెటుల నొదు
రిత్తమాటలు నాకెట్లు ప్రీతి రీతి. 259

ఏమి జెప్పువాడ యీ బంధు జనులగూర్చి,
నాటకమ్ము వట్టి బూటకమ్ము
కొలుపిలుపు కన్న కాదననెప్పుడు,
వలదు తల్లి వీరి పిలుపు నాకు. 260

పరమేమున్నది కనుగొన,
హరికథలను విక్రయించు హరిదాసులకున్,
హరియేమిచ్చును వారికి,
సిరి సంపదలిచ్చువారి చల్వము హెచ్చున్. 261

అడుగ నేముంది త్వదనుగ్రహము తప్ప.
అడుగకయె యిచ్చినావయ్య అన్నినాకు
ఇచ్చినను దాచుకొనలేను నిపుడదేమొ
ఎట్టిభారమును నీమీద నెట్టివైతు. 262

ఏండ్లు పైబడె కష్టంబు లెన్నొపొంది,
అనుభవించితి నవి దరహాస మెసగ
నిన్ను ధ్యానింప నామది నిలువకున్న
దేమిసేయుదు, నాకర్మ యిట్టు లయ్యె. 263

మట్టికుండ నేను గట్టిగా యెట్లుందు,
పట్టి చూచినంత పగిలి పోనె
పట్టి చూచువారు పలువురు నాకైరి
ఎట్లు కాతువయ్య యిట్టి నన్ను. 264

వేరు జన్మమెత్తి వెదుకంగ పనిలేదు
తానుజేయు కర్మ తానెరింగి,
దాని ననుభవింప తాజన్మమెత్తును,
అనుభవింప వలదె యది తలంచి. 265

వేరుపనులు సేయ వీలగునెంతయో
వీలుగాదు నిన్ను లీల దలప
పోదు బుద్ధి యెపుడు పూనియా పరమాత్మ
పోవుచుండు పాడు త్రోవలందు. 266

అఁదముగ పాము సాలీడు నందనారు.
తిన్నడును మరి యెందరో నిన్ను దలచి
పొందవే మోక్షపదవిని పూనివార
లెట్టి వేదాంత సూత్రంబు లెరిగినారు. 267

మాటలు లెక్కసేయవు, సుమా మరియిచ్చుట మాకదెట్టు లో,
మోటులుగామె మేము, మరి మోసమటంచును ఎంచమైతి. మే
నాటి వరప్రసాద మిది, నాటకమయ్యెను మాదు తీరు, నీ
సాటి మరెవ్వరయ్య, తగు చక్కగ తెల్పవె నిన్ను జేరగా.

బ్రహ్మ సూత్రాలు గీతలు పలికి పలికి,
శ్రోతలను ముగ్ధులన్ఁజేసి వెలగువారు
మిడిసి మీసాల సవరించు మేటు లగుచు,
బ్రహ్మవేత్తలె యంత మాత్రాన వారు 269

ధనముపై దారపై మది తగులు వరకు
ఎన్న మోక్షంబటన్నదే సున్న సుమ్ము,
ధనమునే ధ్యేయమని తగఁదలచువారు,
ఎట్టి కర్మకైనను, వొడిగట్టుచుంద్రు. 270

కరమిహామే మది దలచుచు,
పరమును మది దలపకుండ పామరుడగుచున్
పరదూషణ పరపీడన,
పరదారా రతిని గోర పశువగు నిలలో. 271

నీవు యిచ్చునేమి నేపుచ్చుకొనునేమి,
అన్ని రిత్తమాట లన్ని వెఱ్ఱి
కర్మఫలమునంత కడ కనుభవింపక
ఎపుడు పోవగలడె ఎవ్వడేని. 272

ఓపిక పట్టితి నెంతో.
ఆపై చూపెంతొ సన్నమా యెను. విసుగొ
కోపము చూపగ వెరచితి,
హాపోయితి విన్నుదలచి వరమీయగదే. 273

వయసు వాలిపోవ వరములేమిచ్చిన
పాలకూరలోని పాలె యగును
అనుభవింపలేదు తను వా వరాలను
వలదు వాసుదేవ వరములీకు. 274

చేరరే నీదుచెంతఁ నాళ్వారులెవ్వడొ,
వారిలో శూద్రు లెక్కువై వరలుచుంద్రు
నీకు కులము మతమ్ములు లేకపోయె
నేను విప్రుడనై యుంటి నీకు తగనె! 275

ఉచ్చులబడ్డ పావురము లుండిన చొప్పుగనయ్యె మాగతుల్
అచ్చుపండగరావు, కడకచ్చట ముచ్చటకైనఁ జూడవే
ఉచ్చులనట్టె త్రెంచి, తగు నుచ్చపదంబది మాకు నిచ్చినన్
మెచ్చుదుమయ్య నిన్ను కృతిమించగ సల్పెదనీదుపూజలన్.

చేసిన పుణ్యమా యనగ చేరిరి పుత్రకు లేవురస్టై వన్
డాసిన పుణ్యమాయన బెడంగుగ నల్వురు పుత్రికల్ రహిన్,
వ్రాసినవ్రాత నా నౌనట వాసిగ పుణ్యపు రాశియయ్యె నా
కోనము రామమూర్తి యను గుంజెలి కాడుగరాదదేలకో. 277

నవ్వుచు మాటాడినచో,
ఇవ్వగ తావుండుననెడి యిట్టిభయం బే
జవ్వని తగమారినదో,
బువ్వడుగుచు, చేయిజాప బోవమదెప్డున్ 278

చదువుగాదుగొప్ప, సంసారమగుగొప్ప
చదువులేని చాకి చతురుడౌను
ముదముతో మడతలకు ముదిమిచ్చు వేర్వేర
సదమల హృదితోడ సహకరించు. 279

పట్టుధోవతి పైబూది పట్టెలుంచి,
ముక్కుమూసిన మోక్షంబు దక్కునేమి.
మోదకంబకొ యదిగ్రమింగ మోదమునను
లోని శత్రుతతులు నీకు లొంగవలయు. 280

ఒంటిమిట్ట యందు ఓబడు మాలడు,
పట్టుబట్టె రాము దిట్ట యగుచు
ఆ మహీశునాజ్ఞ ఆ వాసు దాసుడు
ఇచ్చె తారకమును యింపుగాను, 281

పట్టెనామాలు పన్నెండు పెట్టనేల,
చాలదొక్కటె శ్రీహరి సన్నుతింప
పట్టెడన్నము ప్రీతితో యట్టె యిడక,
సద్గతులు పట్టెనామాల జరుగునేమి ! 282

శంఖ చక్రాల గైకొని సాగినావు,
మిత్ర రక్షణకో లేక శత్రువధకొ,
అందరును నీవెయై మరి యమరియుండ
శత్రువెవడయ్య నీకు ఓ చతురమూర్తి ! 283

వేషధారులైన వేవేల బాబాలు
క్షుద్రమహిమలెల్ల జూపుచుండ్రు
వారి జూచినంత పరువెత్తి కొందఱు
వారి విడువలేరు బద్ధులగుచు. 284

ఎటుల నమ్మెదు నిన్ను నీవెచట గలవో
కార్య కారణ రూపాన కలవటండ్రు
చెప్పువారికొ, వినువారి చెవికొ తిక్క
తిక్కరెట్టింపు గానయ్యె చక్కగాను. 285

సాహచర్యమిచ్చు సద్గుణవతి భార్య
పోరుసల్పనట్టి పుత్ర చయము
బాగుచూచి యోర్చు బంధువులున్నను
జీవికింక వేరు చింతలేదు. 286

తగినట్లు తీర్చి దిద్దక,
ఎగ త్రోసుకపోయి తీవు యిన్నేండ్లట్టే
తగదిద్దక పొమ్మనగను,
తగునే యిదినీకు తగనిదగు పనికాదే. 287

ఇవ్వగ నటుకలు లేవే
అవ్వను నేగానె పండ్లనందియ్యంగన్
పుష్పాలు లేవే పూజకు
కప్పింపను నిన్ను గొల్లకాంతను గానే. 288

గోపికలకిచ్చు మన్నన,
ఏపారగ నాకు నీయ నెంతది తలపన్
పాపపు రాశినె సతతము
కాపాడగ లేవటయ్య కరుణామూర్తీ! 289

నా తల్లివి నా తండ్రివి
నా తత్వము నీకు తెలియపట్టిది లేదే
ప్రీతిగ ప్రేమను జూపక
భీతిగ పలువంతలిడగ భీరుడగానే. 290

మలిన దుర్గంధ భూయిష్ట మానవాళి,
హృదయ కుహరాల మీరుండు పెట్టులయ్య
మరుగుదొడ్లివి మీరలు మనలరాదు
పొందు వనమృగ హృదయాల నుండుటొప్పు. 921

'ప్రక్కన జేరక చెక్కిలి నొక్కుచు, చక్కని
మరుకేళి సొక్కియుండెడు వేళ'
నన్ను బ్రోవుమని చెప్పవే. సీతమ్మా! అని
వాపోయినాడు రామదాసుగారు.
అమ్మ నీవు సీత ఆరామ చంద్రుతో
ఏక శయ్యనుండి యింపు తోడ.
రతికి ముందే నాదుస్థితి గూర్చి చెప్పమ్మ
భవ్యుడైన రామభద్రునకును. 292

మానవ నాధులు భువిలో
కానని మర్యాద లెందు గానము భువిపై
మానక యవి ఎట్లుందుమ
ఏనాటికి నైన బోవు, ఈశు తలపునన్. 293

ముడిచినట్టి పూల, మోదమలరగ నీవు.
కొంటివయ్య వడిని గోదనుండి,
ప్రేమమూర్తి వయ్య ప్రియమొప్పునట్లుగా
చేయు లీల లెల్ల చెప్పనగునె! 294

కూర్మ రూపివి నీవయ్యె కొండనెత్తి.
దేవకార్యంబు తెంపు మై తీర్చినావు
పూని భక్తులు నీకేల పూజలిదరొ
నీదు రూపంబు భక్తికి నిలువదేమొ. 295

అందచందాలు గలవారి కాదరమ్ము
లొప్పుచున్నవి భువిలోన, తప్పకుండ
కూర్మరూపుడ! నీకది కొదువయయ్యె,
ఏమి టీలీలలో స్వామి ఏమనందు. 296

ఇందుకే సంశయాత్ములై యిలను బ్రతికి
పథము నందంగ లేక పామరులె యగుచు
వేల జన్మల నెత్తుట వేడ్క యగునె
తెలుపు మాదీని. ఓ స్వామి తెల్లముగను. 297

కానరాని హాని కలదంచు నమ్మకచు,
పూన్కితోడ నెవ్వా పూజలిచ్చి
నాటిన భక్తిని నోటమిలేకయె
సల్పుచున్న గతులు సుకరమగును. 298

కావగరావు నీవు, కరిగావగ నీవట వచ్చినాడవే,
పావనమూర్తినిన్ దలచి, పాయకయెంతయొ బాధగుందె నీ
భావనలేమొ నేదలప, భారమదయ్యెను నాకదేలకో
కావల బుద్ధిపోయె కదు గాఢముగా నిను నేదలంపగన్, 299

నీదు బడాయి మాటలవి నీకె తగున్ తగ మాకు గావు నీ
వాదుకొనంగ తల్లడము నాకరిబాసె నటందు తెల్లడున్.
కాదది యెప్పుడేని తరి కాదని యూరక యుంటివయ్య
ఏవాదులవంగ నేలవ రదాన కృపానిధి లచ్చియుండగా 300

మెత్తదనంపు చూపులతొ మెల్లగజేరితివయ్య, నాబలిన్
మెత్తదనంబు జూచి మరి మెచ్చుచు యిచ్చెను నీదుకోర్కె నీ
సొత్తదియంచు నెంచి తగ నొత్తితి వయ్యరొ నీదు పాదమున్
మొత్తితివయ్య వాని మరి యోర్చునె భూమినిఁ గ్రుంగి
పోవుచున్.

తీరని పాపభారమున, తీరికలేదయ నిన్ను నెంచ నే
పారని కోప భారమున పాపపుచూపులఁజూతు నెప్పుడున్
వారకనిన్ను వేడుటఁ న వారిత మయ్యెను నా కదైప్పుడున్.
కోరగరాదు నిన్ను కడు కూరిమి పోయెను నాకదేలకో. 302

తగదది నిన్ను వేడ తగు మెప్పదిపోయెను. చిన్ననాటనే
దిగవిడినావు నీవు. తగు దీనతపోయెను వేగనాకు నీ
వెగబడకున్న మేలు వగలెన్నియొ చూపుదెగొల్ల చేడియల్.
తగులము నొంద, నీయెడల తప్పుఁ చెప్పరె యొక్కరేనియున్.

దాచగలేను నేను. తగ దగ్గఱ చేరెడి వారికెల్ల నే
తోచిన దంతొయింతొ కడుతూర్ణము యిచ్చితి నచ్చుజెప్పితిన్
నోచిన నోమె యంచు తగ నోపిక పట్టితి కష్టవేళలన్
చూచియు నన్ను నీగతిని చూడనియట్లు చరింప న్యాకో. 304

ముండనము చేసికొని పెద్ద దండము గొని,
కావి గుడ్డలు కట్టుచు కాలినడక,
కాశికేగిన మాత్రాన కలదె ముక్తి,
తగ విరాగంబు మనసున దవులదేని. 305

తలచములే విన్నెప్పుడు
తలచిన మరిదెబ్బలాట తప్పదు మనకున్
తలపక నేనెట్లుండెద,
తలపింతువు నమ్ము నీవె తరతరములుగన్. 306

లోకము కొఱకగు పూజలు
ప్రాకటముగ నెట్టుచెలగు ఫలవంతములై
శ్రీకరమగు భక్తి వెలిగ
కాకుత్స్థుని సేవకెట్లు కారణమగునో. 307

కామితంబులెల్ల కడగండ్ల కేగాని
ఏమి ఎత్తుక చనరెవరుగాని,
స్వామి సేవతప్ప పరికింప వేరొండు,
భువినిగాని మరియు దివినిగాని. 308

చెలిమి బలిమిలేదు చేపట్ట సిరిలేదు,
మలిన మొందు నాత్మ మార్పురాదు
కలిమి నీడిపోవు కాసుకు గొరగాదు,
బలిమిపోవు మిగుల బాధనొంచు. 309

అదియె మోక్షంబు ధర్మంబను నిహపరపూ౦బు
అదియె సంసారసారంబు నదియె సర్వ
మదియె నిర్వాణ హేతువై యమరుచుండు
అదియె ధ్యేయంబు నాతవి కనుగుణంబు. 310

నాది నావార లను భ్రాంతి నన్ను పూని
వదలదెప్పుడు దానిచే బద్ధుడయిన,
ఎట్లు నిన్నిల ప్రేమింతు రెవరు చెపుమ,
కాదు నావల్ల పీనిని కడకునెట్టు. 311

కర్మతంత్రుడై మరిజీవి కదలుచుండు
యోని జన్మించి మరియొక యోనికెపుడు
పుట్టుటయె భారమని మదిన్ పుట్టినపుడు
ఆ జగన్మాత మాయయు దొగిపోవు. 312

సర్వసంగ పరిత్యాగి సతమురాధ,
కాన గోలోక వనముల కలదటంద్రు,
నిన్ను నామెకు కట్టుట నొప్పదావె
లోక మర్యాద లివియేమొ లోలతగను. 313

ప్రేమతత్వంబు తెలియని వెఱ్ఱులెల,
ప్రేమ యన లైంగిక ప్రేమ యంద్రు
ప్రేమతత్వంబు గౌరాంగ విభుడెరింగి,
చేరె నీపాదకమలంబు శీఘ్రముగను, 314

ఒరుల ప్రేమించు టొప్పక యుండువాడు
నిన్ను ప్రేమింప జాలునే నిగమ వినుత,
ఒరుల ప్రేమించి సేవించి యొప్పునతడు
నిన్ను ప్రేమించి నీప్రేమ గొన్నవారు. 315

తగిన యోగాగ్నిచే కర్మ దగ్ధమగును
నతడు యోగీశ్వరుండౌచు నమరుభువిని,
సర్వమును తానెయె యుండు ఉర్వినతడు
వీక నెరుగడు లోకంపు పోకడలను. 316

సారెసారెకు నిన్నట్టె సన్నుతింస
అణిముత్యాల సరులు యందుకొందు
వింత చాతుర్యమా యది సుంతలేదు
అందుకొనుటెట్టు నిన్నట్టె పొందుగాను. 317

దేవదేవికి దాసుడై దీక్షమాని,
విప్రనారాయణుం డెంతో విఱ్ఱవిగె
తనదు తప్పిద మప్పుడే తానెఱింగి,
చెందడే విష్ణుపదము విచిత్రముగను. 318

జగతిలో నవగుణమున్నను
తగునే మరి త్రోసిపుచ్చ దయలేకుండన్
సుగుణములు లెక్క సేయక
నగుబాటులు సేయుటెట్లు న్యాయంబగునో! 319

ఉప్పులేక రుచుల చొప్పు తప్పెప్పుడు
తప్పు లేక యొప్పు తారసిలదు
ముప్పులేకయున్న, మునుదేవు తలపము
ఎప్పుడైన గాని యెందు గాని, 320

నీదు మాయకు లోబడి నిలుచువరకు
మోక్ష మది సున్న. ఎవ్వరు పొందలేరు.
నీదు మాయ కతీతుడై నిలుచునపుడు
చేరు బ్రహ్మపదంబును చివరికెట్లో. 321

సర్వసంగ పరిత్యాగి సర్వసముడు
అంటి అంటక నెటులో తానింట నుండి
చేరుతా పరతత్వంబు చింతలేక
మమ్మ బోటుల కర్మాతే మది దలంప ! 322

అట్టివాడెపో బ్రహ్మజ్ఞు డనగబరగు
సర్వసంగ పరిత్యాగి సర్వసముడు
కడకు తన శరీరంబునే కానకుండు
ఇట్టి వాడెపో బ్రహ్మము నట్టె చేరు. 323

కర్మ బంధంబుచే జీవి కట్టబడును
దాని తప్పించుకొన కర్మ పూనిచేయు
పుట్టుకలమీద పుట్టుకల్ పడమినోడు,
కడకు విడిపోదు కడదాక కర్మచయము. 324

కర్మపయి ఫలాపేక్షలు కానరేవి,
కడకు యోగులై మోక్షంబు గాంచుచుంద్రు
అట్టుగానివారు జోగులై సతతము
ఊరు వాడల తిరుగుదుర్, కోరి చేరి. 325

దేవి పర్యంకమున వినోదించు నీకు
పాప పాన్పులవేల పద్మనాభ
నీకు తిరుగుళ్ళు మెండాయ సాకుచెప్పి
అమ్మపాదాల వత్తుట వమ్ముగాదు. 326

అప్పుజేసి నగల నందివ్వ లేనయ్య
పప్పు పాయసాల పంచలేను
ఎప్పుడైన భక్తి నే దలంపను నిన్ను
చెప్పుకొనుటకైన సిగ్గుచేటు. 327

వాదుసుమీ నిను దలచుట
పోదుసుమీ నాదు బుద్ధి పొరలుచు నీపై
లేదుసుమీ లేమిడి చే
కాదు సుమీ యనక నన్ను కావగరాదే 328

ఆర్తి తమ్ముడు శ్రీరామమూర్తి నన్ను
శ్రావణంబున నను బాపి **శంభుజేరె**
చేయునది లేదు చేదోడు చెల్లె నాకు
నాకు రాదయ్యె నీపోక నయముగాను. 329

కాయకష్టంబు చేసి తా కాంక్ష వీడి,
సాకె బిడ్డల నెంతయో సాధురీతి
తీర్చె బిడ్డల నెంతయో ధీరవృత్తి
పోయె నాతడు శంభుని పూని మదిని. 330

ఏపురము మేము పుట్టితి మేనొకండ,
నిలిచి యున్నాను భువిమీద నీవెగతిగ,
కాయమాసశ్కె కన్నులు కానరావు
చేయునదిలేదు నిన్నె నే చేరవలయు. 331

ముద్దుగ నొప్పు పార్వతియె ముచ్చట చేరెను శంభు నర్ధమై
హద్దది మించునట్లు హృదిహత్తెను విష్ణువు లక్ష్మి యట్టై తా
సద్దుగఁజేరె శారదయు సత్వర మావిధి యాస్యమందు ఈ
ఈ సుద్దు లవేల దేవ, తగుచొప్పది చూపవె నిన్ను జేరగన్. 332

చీకటిమూఁలల చిందులు మీకేల ఎలుకల పరుగులు ఏమి హాయి,
గబ్బిలంబులు మీకు ఘనస్వాగతముపల్కు వీచునురెక్కలువీవనలుగ
మాగుడువాసన మానదదెప్పుడు మడివస్త్రములులేవెమార్చుకొనగ
ఘనసార గంధంపు ఘ్రాణంబులేదాయె తైలంపుపూతలుతనరెమీకు

ఎండుపిండంబును ఎప్పుడో యిడుదురు మధురాన్నములులేవె
గ్రామదేవాలయంబుల గడపనేల మమత మీర
కాలమాసన్న మయ్యెను కాంక్షవీడి
తడవు సేయక మీరట్టె తరలి పొండు
అమ్మ రంగమ్మ భర్తతో నడుగుమమ్మ. 333

తల్లిదండ్రుల ద్వేషించు తనయులట్టె
పెట్టు పిండము లెవ్వరి ప్రీతి కొరకొ
బంధు జనముల మెప్పులు బడయుటె యగు
కోరిచేరునె పైవారి కోర్కెమీర. 334

సుతులు లేకున్నలేవు సద్గతులు సతము
ఏరికన్వయమో యిది యెరుక గాదు
సుతులు లేనట్టి భీష్ముడు గతులు గనడె
ఏమిటీ లీలలో రామ యెరుగ గలమె. 335

పూర్వ జన్మంపు పాపమె పుత్రుడై న
తండ్రి కింకేమి కొదువ తద్దినము తప్పి
కాకి పొడుపులు కూత కాకా యటంచు
ప్రక్కచూపులు చూచుచు పరుగుచుండ్రు. 337

పాడుబడ్డ గుడుల ప్రాంగణంబుల యందు.
చీట్లపేకయాట చెలగుచుండు
చుట్టలందు వెడలి సొంపైన పొగరేగు
బ్రాంది బుడ్లు చూడ భయము గొలుపు 338

పోతుకు సిద్ధమౌను ప్రబుద్ధత లేకయె యెప్పుడేని నీ
వూరక తోలుచుందువయ ఊబిని గూలితి మేము దుర్గతిన్
వారక నీవెవచ్చి వడి వల్మరు ప్రీతిని బ్రోవు మిత్రరిన్
మారదు నాదు చిత్తమిక మాటలవేలకొ నన్నుబ్రోవవే. 339

కమనీయంబగు నీదు మోముగని ఎట్లో చేరిరా చేడియల్
అమరేంద్రాదులకైన నీలగునె నిన్నట్లే తగన్ చేరగన్
విమలంబైన ధృతిన్ మనంబున నినున్ ధ్యానించువారట్టె నీ
కమనీయంబగు పాదపద్మముల నెటోచేరుచుందుర్ రహిన్.

మడులంచున్ గుడులంచు నెంచెడి మనోభావంబుతో మిమ్ము
అడుగుల్ పట్టుక మ్రొక్కువారికి నదేమో అందవీవెప్పుడున్
తడవింతేనియులేక ధ్యానమును తానెంతేనైన నేయంగ వే
సడలున్ బాప చయంబదంటి వటుకాదె చూడ చోద్యంబగున్.

మది మదియని మరి దలతును
మది పంచకుగాని నాదు మనసున కౌనే
మది కట్టి వెరతు మదిలో
మది వేతలు లేవు నాదు మనసున నెపుడున్ 342

పావులు లెక్కబెట్టుదువె పాతకములను నెంచకుండు ఏ
పావులు నీకు నిచ్చు పరిపాటి సుఖంబు భువిన్ నభంబునన్
పావులు నీకె జెల్లు పరిపాటిని దాచగ లోభిమానసా ఏ
పావులగాచనయ్య యిల ప్రాణము పోయెడు వేళనెన్నడున్.

పాలకవర్గ మెప్పుడును పాడియెలేకయె వచ్చుచుండు నీ
ఆలయ మట్టె చూచి మలయానిల వీచుల ముగ్ధులౌదురే,
ఏల ఇవన్ని మాకనుచు నేర్పడ జెప్పుచు కావ్కలెల్ల తా
మాలయ సన్నిధిన్ వదలి యాదట గొంద్రు గృహమ్ము
లోపలన్.

## అపరాధస్తుతి :-

రాతికి నాతికి కోతికి,
ప్రీతిగ మోక్షంబు నిచ్చు పేరిమి వింటిన్
కోతిని నేననియే సం
ప్రీతిగ నాకోర్కె దీర్చు పీతాంబరుడా. 345

చిలిపి పనులెగాక చిల్లర మల్లర
చేష్టలెన్నొ నేను చేసినాను,
దీక్ష బూనలేను, దీనత్వమా సున్న
ఎటుల బ్రోతువయ్య యిట్టి నన్ను. 346

మున్నెన్నడు నిన్నిగతి
నన్నుతి జేయంగలేదు సరసిజనాభా,
నన్నిగతి దిగవిడచిన
క్రన్నన నను బ్రోచువారు కలరే భువిలో. 347

పాము చావకుండ బడిత విరగకుండ
కొట్టినావు దెబ్బ గట్టిగాను.
ఇట్టి చేష్టలందు యింగిత మేముండె
చేర్పుకొనవదేల చెట్టబట్టి. 348

అమ్మ నీవారమై మేము అలరినాము
మమ్ము కాపాడు బాధ్యత మీదె యౌను.
వేనికర్హతయో తగదానినిచ్చి
నాదు పైరుస చక్కగ నుంచుమమ్మ. 349

సీతమ్మ వరము లిచ్చును
సీతమ్మిచ్చెడు వరంబు స్థిరమైయుండున్
సీతమ్మను నేదలచెత,
ఖ్యాతియు, ధనము, సుఖమ్ము గలుగుట కొఱకై. 350

తల్లి నీపాదరేణువు తగిలినంత,
హనుమకు జనియించె నీయందు అధికభక్తి.
అట్టి భక్తిని నాకిదు మమల చరిత
భక్తి పొందుదు అవల ముక్తి కలదు. 351

నేను పాలంభనము చేసినానటంచు
కోపతాపాల నవి యేవి చూపకుండ
ప్రాణమానాల బ్రోచునిన్ మానసాన
ఏమని పొగడుదును నిన్ను ఇందిరేశ. 352

పరువది లేక నిన్ను పొరబాటని యెంచక దెబ్బలాడితిన్
మరుగది లేక నిన్ను కదుమత్తతతో తెగదిట్టజూచితిన్
అరమర లేల నీకు మరి ఆర్తిని జెందితి, నన్ను బ్రోవుమా
మరువను నిన్ను నీడనిక మానక నీ భజనమ్ము చేసెదన్.

వీడగలేమ నిన్ను విడిపోవగ నామనసొప్పదయ్య నీ
వేడుక చూడబోను వెలుగొందుదు నిన్నెదె దేవరింప ఏ
వాడను నిన్ను లోబరుప వేడుకబోయెను నాకదేమొ నీ
వాడను నేను గానె విడనాడక బ్రోవుము నీకుమ్రొక్కెదన్. 354

ఏపుగజేరి తెర్చ్వదిని, ఏమని చెప్పుదు యిట్టివేళ నే
నోపను నిన్నువేడ తగనోపిక పోయెను అట్టెనాకు నే
నాపుకొనంగలేను మరి నాకెటు లోపును నిన్నుదెప్ప నే
పాపపు రాశినైతిని పరాకది లేకయె నన్ను గావవే 355

అందగరాని దాని తగనందు నటంచును నెంచితిన్ మదిన్
పొందగజాల నీదు పరిపూర్ణ కటాక్షము మాకు లేనిచో,
ఎందని పోవు వాడ తగనెందరొ చెప్పిరి పెక్కుపోక లా
చందము నాకు గిట్టదిక చక్కగ జేరెద నీదు సన్నిధిన్. 356

కార్య సాధనకై పడు కష్టమందు
అర్థమున్నను చాలు ఆధ్యాత్మ కృషికి,
నాటి నాటికి వృద్ధియై నయము మీర
ఫలము నందంగ వచ్చును ప్రాజ్ఞుడెపుడు 357

ధర్మ సంరక్షణార్థమై తరలుచుంద్రు
పుడమిపైకట్టె పుణ్యమా యనుచు వచ్చి
కానరానట్టి బాధల కనుచు నుంద్రు
ఏమి ప్రేమయ్య మాపైన యేమనందు. 358

నన్ను నాపద్యములఁ జూచి నవ్వ దీవు
కానిచో నాదు దుష్కృతి పోవపోదు
మానసిక పాప భూయిష్ఠ మమత లెన్నొ
నీదు వీక్షణ తోడనే నీల్గునంటి. 359

పరువు పోనాది వేదను పరుల నెపుడు
నీదు మఱుగునన్ చేరితి నిన్ను నమ్మి
పఱుగు పఱుగున రావె నా ప్రార్థనమున
ఎఱుగవే నాదుబుద్ధి నీవేల రావు. 360

మన్నింపుము నన్నెప్పుడు
క్రన్నన దయగావు నన్ను కరుణామూర్తీ
మన్నింపకున్న నాకే
మున్నది గతి యింక నాకు ఒనగుము ముక్తిన్. 362

కూడగ మేమిద్దఱమును,
కొడుకులు కోడండ్రు తోడ కూతులతోడన్,
కూడిన యల్లుండ్రును దగ,
పోడిమి నలుబది యేవురము మమ్ము ప్రోవుము తల్లీ! 363

వద్దు మానవజన్మమే వద్దు స్వామి
ఇమ్ము మృగజన్మ మేలది యింపుగూర్చు
మానవత్వము లేకున్న మనుజుడౌనె
మమత లవి మమ్ము ముంచును మానకెపుడు. 364

అరయ వెంకట నారాయణప్ప తండ్రి
తల్లి సుబ్బమ్మ అనురాగవల్లి, నన్ను
వీరు కని పెంచి పెద్దజేశారు ప్రీతి
వీరి కీకృతి నందిత్తు కోరి భక్తి. 365

---

## ముద్రణకు ధన సహాయము చేసిన దాతలు :

| | | |
|---|---|---|
| శ్రీ మల్లవరపు సుబ్బారావుగారు | | రూ 530-00 |
| ,, కలిపె సూర్యనారాయణరావు (దంపతులు) | | 200-00 |
| ,, కలిపె భార్గవరామ | ,, | 200-00 |
| ,, కలిపె ప్రభాకరరావు | ,, | 100-00 |
| ,, చాగంటి వీరభద్రరావు | ,, | 250-06 |
| ,, లేఖరాజు వెంకట్రామయ్య | ,, | 100-00 |
| ,, పాతపాటి సూర్యనారాయణ | ,, | 100-00 |
| | | 1480-00 |

అల్లుండ్రు, అభిమాన పుత్రుల సాయమున ముద్రణ ముగిసినది వీరికి నా దీవనలు.

డి. యల్. నారాయణయ్య.

వెల : ఉచితము.

